టనలను మాత్రమే గుర్తించే ప్రచార సాధనాలకు 1989 నవంబర్ ఎన్నికల దాకా కాశ్మీరీల ఆందోళన పట్టనే లేదు. ఆ ఎన్నికలలో అనేక చోట్ల ఒకశాతం నుంచి పది శాతం వరకు మాత్రమే వోట్లు పడ్డాయనే వార్తపత్రికలకెక్కింది. ఆ తర్వాత కేంద్ర హోం మంత్రి కూతురు రుబియా సయీద్‌ను జెకెఎల్ఎఫ్ కార్యకర్తలు కిడ్నాప్ చెయ్యడంతో కాశ్మీర్ ఆందోళన పత్రికల్లో రోజువారీ వార్త అయింది. జెకెఎల్ఎఫ్ ఆందోళన వెనుక ఉన్న దశాబ్దాల చారిత్రక విషాదాన్ని పట్టించుకోకుండా, ప్రకటించకుండా ఉన్న ప్రచార సాధనాలన్నీ హఠాత్తుగా ప్రభుత్వ సమాచార పత్రాల్నే వార్తలుగా ప్రకటించడం మొదలు పెట్టాయి. కాశ్మీరీ ఆందోళనకారులను ఉగ్రవాదులుగా, పాకిస్తాన్ ఏజెంట్లుగా ముద్రవేసి ప్రచారం చేయడం మొదలుపెట్టాయి.

1990 జనవరి 19న జగ్‌మోహన్‌ను కాశ్మీర్ గవర్నర్‌గా నియమించడంతో ఈ దుష్ప్రచారం తారస్థాయికి చేరింది. తనకు ఆర్ఎస్ఎస్ భావజాలంతో ఏకీభావం ఉందని బహిరంగంగా చెప్పుకునే జగ్‌మోహన్‌ను ఇటువంటి సున్నితమైన ప్రాంతానికి పంపడం ద్వారా కేంద్ర ప్రభుత్వం కాశ్మీర్ జాతీయాభిమానాన్ని తీవ్రంగా అవమానపరిచింది. జగ్‌మోహన్ కాశ్మీర్‌కు వెళ్ళిన వెంటనే ఆందోళనను మత కల్లోలంగా చిత్రించడానికి ప్రయత్నాలు ప్రారంభించారు. కాశ్మీరీ పండితులకు, ముస్లింలకు మధ్య ఘర్షణలు జరుగుతున్నాయనే అబద్ధ ప్రచారం సాగించాడు. కాశ్మీర్ లోయలో హిందువులకు రక్షణ కల్పించలేమని, వాళ్ళకు జమ్ముకు గాని, ఇతర రాష్ట్రాలకు గాని వెళ్ళే ఏర్పాట్లు చేస్తామని ప్రచారం చేసి, మత విద్వేషాన్ని రెచ్చగొట్టాడు. జమ్ము వెళ్ళిన హిందూ ఉద్యోగులకు పని చెయ్యకపోయినా జీతాలు ఇస్తూ, శ్రీనగర్‌లోని ముస్లింలపట్ల వివక్ష ప్రదర్శించాడు. కాశ్మీర్ లోయను రోజుల తరబడి కర్ఫ్యూపాలు చేసి, పౌరజీవనాన్ని స్తంభింప జేశాడు. జగ్‌మోహన్ చర్యలవల్ల కాశ్మీరీల జాతీయకాంక్షలు భారతదేశంలో నెరవేరవని, జాతీయ విముక్తి పోరాటం తీవ్రంగా సాగించవలసిందేనని రుజువైంది.

ఐతే జాతీయ విముక్తి పోరాటాలు నిజంగా జాతివిముక్తిని సాధించి, జాతీయాకాంక్షలను నెరవేర్చాలంటే కార్మికవర్గ పార్టీ నాయకత్వాన భూస్వామ్య వ్యతిరేక, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాలుగా నిర్వహించ

బడక తప్పదు. బూర్జువా ప్రజాస్వామిక వర్గాల నాయకత్వంలో ఇటువంటి పోరాటాలు కొద్దికాలం పాటు సమరశీలంగా నడిచినట్లు కనిపించినప్పటికీ అంతిమంగా విద్రోహం పాలవుతాయనేది చరిత్ర చెప్పిన సత్యం. 1930ల్లో ప్రారంభమైన కాశ్మీరీ జాతీయ విముక్తి పోరాటానికి నాయకత్వం వహించ డానికి ఐదు దశాబ్దాలు గడిచినప్పటికీ నిజమైన కార్మికవర్గ పార్టీ ఆవిర్భ వించలేదు. భారత కమ్యూనిస్టు పార్టీ కాశ్మీర్ ప్రజాందోళన విషయంలో 1940ల్లో తీవ్రమైన చర్చలు చేసి, కాశ్మీరీల పోరాటాన్ని నిర్ద్వంద్వంగా సమ ర్థించింది గాని, 1950ల తర్వాత భారత కమ్యూనిస్టు పార్టీ, భారత కమ్యూ నిస్టు (మార్క్సిస్టు) రెండూ కాశ్మీరీలకు వ్యతిరేకంగా భారత పాలక వర్గాల బృందగానంలో గొంతు కలిపాయి.

1948లో భారత కమ్యూనిస్టు పార్టీ రెండో మహాసభ ఆమోదించిన రాజకీయ నివేదికలో కాశ్మీర్ ప్రజల స్వయం నిర్ణయాధికారాన్ని పూర్తిగా సమర్థించాయి. "...రెండు దేశాల సరిహద్దులలో ఉన్న రాష్ట్రాల గురించిన ఘర్షణలో ఇరుపక్షాలలోనూ ఉన్నది భూ ఆక్రమణ కోరికే తప్ప, ప్రగతిశీల అంశమేమీ కాదు. రెండు దేశాలూ వ్యక్తం చేస్తున్న ఈ భూదాహాన్ని ఇరు పక్షాల ఉన్న కార్మిక వర్గమూ సమర్థించడానికి వీలులేదు. ఈ రెండు దేశాలూ కూడ ప్రజల స్వయం నిర్ణయాధికార హక్కును సమర్థించవు; ప్రజలు, రైతాంగం భూస్వామ్య పాలన నుంచి కోరుతున్న విముక్తిని సమర్థించవు" అని ఈ నివేదిక స్పష్టం చేసింది.

ఈ రెండో కాంగ్రెస్‌ను సమీక్షిస్తూ పొలిట్ బ్యూరో తయారుచేసిన నివేదికలో కాశ్మీర్ సమస్య ఇంకా వివరంగా ప్రస్తావనకు వచ్చింది. ఈ సమీక్ష ప్రకారం, కేంద్ర కమిటీ తరఫున భవానీసేన్ పాకిస్తాన్ సమస్యపై ఒక నివేదికను కాంగ్రెస్ ముందు చర్చకు ఉంచాడు. ఆ నివేదికలో, కాశ్మీర్ లోకి భారత సైన్యాల ప్రవేశాన్ని పార్టీ ఆహ్వానించిందనీ, అది పొరపాటనీ చెప్పాడు. భారతదేశం ప్రగతిశీలమైనదనీ, పాకిస్తాన్ అభివృద్ధి నిరోధకమైన దని తప్పుడు అవగాహనకు పార్టీ లోనయిందని భవానీసేన్ అన్నాడు. "మనకు సంబంధించి, విలీనమనేది ప్రశ్న కానేకాదు. అటువంటి విలీనమేదైనా భారత ప్రభుత్వానికి గానీ, పాకిస్తాన్ ప్రభుత్వానికి గానీ నిరంకుశ రాచరికంతో

కలిసే పొత్తు మాత్రమే. ప్రజాస్వామిక విప్లవం సంపూర్ణంగా విజయవంత మయ్యేదాకా విలీనమయ్యే ప్రశ్నే తలెత్తదు. కష్టజీవులైన రైతాంగం భూమిని సాధించేదాకా, రాచరిక నిరంకుశత్వం రద్దయ్యేదాకా, అధికారం ప్రజల హ స్తగతమయ్యేదాకా విలీనమనే ప్రశ్నే లేదు...'' అని చెప్తూ, ''నిజమైన మార్గాంతరాన్ని వీరోచిత తెలంగాణ రైతాంగం చూపుతున్నారు. ఈ సమ స్యకు నిజమైన పరిష్కారం యుద్ధరంగం మీదనే ఉంటుంది. తెలంగాణలోని ప్రజాయోధులు, నిరంకుశత్వానికి వ్యతిరేకంగా వారిపోరాటం, సంస్థానాలలో ఏమి జరుగనున్నదో మాత్రమే కాదు, భారతదేశంలోనూ, పాకిస్తాన్‌లోనూ భవి ష్యత్తులో ఏమి జరగనున్నదో చూపుతున్నారు'' అన్నాడు భవానీసేన్. ''హైదరాబాద్‌కు, కాశ్మీర్‌కు మధ్య వ్యత్యాసం మన పాత అవగాహనకూ, కొత్త అవగాహనకూ మధ్య వ్యత్యాసమే...ఇప్పుడు సమస్యల్లా ప్రజలు హైదరాబాద్ మార్గాన్ని అనుసరిస్తారా, కాశ్మీర్ మార్గాన్ని అనుసరిస్తారా అనేదే. ప్రజలు హైదరాబాద్ మార్గాన్ని అనుసరించేలా చూడడం మన కర్తవ్యం'' అన్నాడు భవానీసేన్.

ఐతే ఈ స్పష్టమైన, సరైన అవగాహన పార్టీలో త్వరలోనే అంతరించి పోయింది. పైసమీక్ష 1948 మార్చిలో వెలువడగా, ఆ సంవ త్సరం డిసెంబర్‌లో పొలిట్‌బ్యూరోకూ, కేంద్రకమిటీకీ ప్రధాన కార్యదర్శి ఇచ్చిన నివేదికలో ఈ అవగాహన మారిపోయింది. ''భారత ప్రజల ప్రజా

స్వామిక విప్లవ పోరాట వ్యూహం-ఎత్తుగడలు' పేరుతో ప్రసిద్ధమైన ఈ నివే దికలో, కాశ్మీర్ విషయమై అప్పటి వరకు పార్టీ అనుసరించినది పెటీబూర్జువా విప్లవ వాదమని భారత, పాకిస్తాన్• రెంటినీ ఒకేగాట కట్టివేయడం ద్వారా అది సామ్రాజ్యవాదకుట్రకు బలి అయిపోయిందని కొత్త సిద్ధాంతం తయా రయింది. స్వతంత్ర కాశ్మీర్ అనే నినాదం ప్రస్తుత పరిస్థితుల్లో సామ్రాజ్య వాదానికి ఉపకరిస్తుందని, అంటూ అసలు కాశ్మీరీ జాతి అనేదే లేదనే దాకా ఈ నివేదిక వెళ్ళింది. ఇవాళ కాశ్మీరీలు స్వాతంత్ర్యాన్ని కోరితే రేపు గిల్గిత్‌లో కూడ స్వాతంత్ర్యాన్ని కోరరా అని ప్రశ్నించింది. ఈ తర్కమంతా నడిపి, అక్కడితో ఆగక, కాశ్మీరీలకు భారతదేశంలో కలిస్తే భారత కార్మికవర్గం అనే పెద్దశక్తి అండ దొరుకుతుందని, పాకిస్తాన్‌లో కలిస్తే పాకిస్తాన్ కార్మిక

వర్గం అంత శక్తివంతమైనది కాదుగదా అని కుతర్కమూ చేసింది. మొత్తం మీద ప్లెబిసైట్‌లో భారతదేశానికి అనుకూలంగా వోటు వెయ్యమని కాశ్మీరీలను కోరింది.

నిజానికి ఈ సమయం పార్టీలో సంక్షోభం సాగుతున్న సమయం. రెండో కాంగ్రెస్ నుంచి 1950 జనవరి దాకా బి టి రణదివె పార్టీ ప్రధాన కార్యదర్శిగా ఉన్నాడు. పైన చూసిన నివేదికలు, అవగాహనలు ఆకాలానివి. 1950 జూన్‌లో పార్టీ కేంద్రకమిటీ పునర్నిర్మాణం జరిగింది. చంద్ర రాజేశ్వర రావు ప్రధాన కార్యదర్శిగా కొత్త కేంద్ర కమిటీ 1950 జూన్ 1న పార్టి సభ్యులందరికీ ఒక లేఖ రాసింది. ఆలేఖలో "జాతుల సమస్యపై, పార్టి రెండో కాంగ్రెస్ నాటి నుంచి పొలిట్‌బ్యూరోలో జాతుల ఉద్యమాలను వ్యతిరేకించి, బడా బూర్జువా దురహంకారానికి సేవ చేసే అభివృద్ధి నిరోధక విధానం అమలవుతూ వచ్చింది" అంటూ కాశ్మీర్ భారతదేశంలో విలీనం కావడమే కమ్యూనిస్టు పార్టీ డిమాండ్ అనే తప్పుడు అవగాహన సాగిందని ఈ లేఖలో రాశారు.

1950 నాటికి కొనసాగుతూ వచ్చిన ఈ ఊగిసలాట త్వరలోనే అంతమయిపోయింది జాతుల పోరాటాలను వ్యతిరేకించడంలో భారత కమ్యూనిస్టు పార్టి పాలక వర్గ పార్టిలతో పోటీ పడే దశకు ఎదిగింది, భారత కమ్యూనిస్టు పార్టి (మార్క్సిస్టు) కూడ ఈ మూసలోనే జాతుల విముక్తి పోరాటాలను వ్యతిరేకిస్తూ వచ్చింది. ఈ రెండు పార్టిలూ కూడ కాశ్మీర్ సమస్యను కాశ్మీర్ ప్రజల సమస్యగా కాక భారతదేశానికి పాకిస్తాన్ సృష్టిస్తున్న సమస్యగానే ఇప్పటి దాకా చూస్తూ వస్తున్నాయి.

"జాతులు విముక్తిని కోరుతున్నాయి, దేశాలు స్వాతంత్ర్యాన్ని కోరుతున్నాయి" అని నిర్వచించదగిన యుగంలో పుట్టిన భారత కమ్యూనిస్టు పార్టి (మార్క్సిస్టు-లెనినిస్టు) తన కార్యక్రమంలోకాశ్మీర్ జాతి విముక్తి పోరాటాన్ని ప్రస్తావించింది. 1970 మేలో పార్టి కాంగ్రెస్‌లో ఆమోదించిన కార్యక్రమంలో "కాశ్మీరీల, నాగాల, మిజోలకు స్వయం నిర్ణయాధికార హక్కు నిరాకరించబడుతోంది" అని గుర్తించి "ప్రజల ప్రజాతంత్ర రాజ్యం భారతదేశాన్ని సమైక్య పరుస్తుంది, స్వయం నిర్ణయాధికార హక్కును గుర్తిస్తుంది" అని ప్రకటించారు.

కాశ్మీరీలు స్వయం నిర్ణయాధికారం కోసం పోరాడుతున్నారు. విస్తృతమైన ప్రజాపునాదితో, పటిష్టమైన నిర్మాణాలతో, క్రియాశీలమైన పోరాట రూపాలతో కాశ్మీరీ జాతి విముక్తి పోరాటం నానాటికీ విజృంభిస్తున్నది. అయితే కార్మిక వర్గ పార్టీ నాయకత్వం కింద సాగనంత కాలం జాతి విముక్తి పోరాటాల భవిష్యత్తుకు హామీ లేదు కాశ్మీరీ జాతి విముక్తి పోరాటం ఈ వాస్తవాన్ని గుర్తించాలని కోరుతూనే ఆ పోరాటం నూతన ప్రజాస్వామిక విప్లవంలో భాగం కావాలని ఆహ్వానిస్తూనే ఆ పోరాట కారులకు పూర్తి మద్దతు పలకడం, వారి మీదసాగుతున్న దమన కాండను ఖండించడం మనకర్తవ్యమవుతుంది.

## ముఖ్యమైన ఆధారాలు

కె.బి. కృష్ణ- ది ప్రాబ్లమ్ ఆఫ్ మైనారిటీస్, ఆర్, కమ్యూనల్ రిప్రజెంటేషన్ ఇన్ ఇండియా, జార్జి ఆలెన్ అండ్ అన్విన్, 1939.

వి.పి. మీనన్- ఇంటిగ్రేషన్ ఆఫ్ ది ఇండియన్ స్టేట్స్, ఓరియంట్ లాంగ్మన్ 1985 లారీ కాలిన్స్, డామినిక్ లాపియర్- ఫ్రీడమ్ ఎట్ మిడ్ నైట్, తరంగ్ పేపర్ బ్యాక్స్, 1982.

ఫ్లారెన్స్ ఇలియట్- ఎ డిక్షనరీ ఆఫ్ పాలిటిక్స్, పెంగ్విన్ బుక్స్, 1973
ఇ.ఎం.ఎస్. నంబూద్రిపాద్- భారత స్వాతంత్ర్య పోరాట చరిత్ర, ప్రజాశక్తి బుక్‌హౌజ్, 1988.

సుమిత్ సర్కార్- మాడర్న్ ఇండియా, 1885-1947, మాక్మిలన్. 1983
ఎం.బి. రావు (సం.), డాక్యుమెంట్స్ ఆఫ్ ది కమ్యూనిస్టు పార్టీ ఆఫ్ ఇండియా 1948-కా, పిపిఎచ్, 1976.

దుర్గాదాస్ బసు- ఇంట్రడక్షన్ టుదికాన్‌స్టిట్యూషన్ ఆఫ్ ఇండియా, ప్రెంటిస్ హాల్, 1987.

పి. ప్రసాదు- కన్నీటి ధారల్లో కాశ్మీర్‌లోయ, ప్రజా పంథాప్రచురణలు, 1990

ఉర్దూ కథ

# ఆఖరి వందనం

—సాదత్ హసన్ మంటో

ఈ కాశ్మీర్ యుద్ధం చాలా విచిత్రమైన వ్యవహారం. ఒక్క ముక్క అర్థమైచావదు సుబేదార్ రబ్‌నవాజ్‌కు దాదాపు మతిపోయేనంత అయోమయంగా వుంది తన బుర్ర సేఫ్టీక్యాచ్ పాడయిపోయిన రైఫిల్ లాగా తయారయిందని తరచూ అనిపిస్తోంది..

రబ్‌నవాజ్ యుద్ధంలో ఆరితేరినవాడు. రెండో ప్రపంచ యుద్ధంలోఎన్నో ప్రధాన రంగాలలో పోరాడి మంచి పేరు గడించాడు. అతని మేధాశక్తినీ, ధైర్యసాహసాలనూ చూసి అందరూ దంగైపోతారు సీనియర్లుఅతని జూనియర్లు, సైతం గౌరవిస్తారు. యుద్ధంలో అతికష్టమైనపనులు, ఇతరులెవరూ చేయ సాహసించని ప్రమాదకరమైన బాధ్యతలూరబ్‌నవాజ్‌కు నిస్సంకోచంగా అప్పగిస్తారు రబ్‌నవాజ్ కూడా తన మీద వుంచిన నమ్మకాలను ఎన్నడూ వమ్ము చేయలేదు. అటువంటి యోధుడికి సైతం కాశ్మీర్ యుద్ధం పరమార్థమేమిటో అంతు చిక్కడంలేదు. ఇటువంటి యుద్ధంలో ఆతనెన్నడూ పాల్గొన లేదు కనీసం వినలేదు. రబ్‌నవాజ్ యెంతో ఉత్సాహంతో యుద్ధరంగంలోకి ప్రవేశించాడు. శత్రుమూకలను చెండాడి మట్టిగరిపించాలని అనుకున్నాడు. కానీ తొలి ఘర్షణలోనే అతని సమరోత్సాహం నీరుగారిపోయింది. తన యెదురుగా నిలబడి పోరాడుతున్నది యెవరోకాదు. తనపాత స్నేహితులు! బ్రిటిష్ ఇండియన్ సైన్యంలో తన సహచరులు!! జర్మన్లకూ, ఇటాలియన్ పటాలాలకూ తనతో కలిసి ఎదురొడ్డి పోరాడిన వాళ్ళు! నిన్నటిదాకా తనమిత్రులు, ఇప్పుడు శత్రువులైపోయారు. ఈ ఉదు నిజం రబ్‌నవాజ్‌కు కొరుకుడు పడడంలేదు.

గతం ఒక్కసారి రబ్‌నవాజ్ కళ్ళముందు మెరిసింది. అంతా ఒక కలలాగా కదలాడింది. రెండోప్రపంచ యుద్ధం ప్రకటించిన రోజు అతనికి గుర్తుకొచ్చింది వెంటనే అతని మనసులో జ్ఞాపకాలు ఒక జాబితాలా మెదిలాయి.

యుద్ధంగురించి కొంత బేసిక్ శిక్షణ ఇచ్చి తమందరినీ యుద్ధ భూమికి పంపారు. ఒక ప్రదేశం నుంచి మరో ప్రదేశానికి, ఒక రంగంనుంచి మరో రంగానికి అక్కడినుంచి మరో చోటికి ఇట్లాతనను మార్చారు. యెట్లాగైతేనేం ఒకరోజున యుద్ధం ముగిసింది ఆ తర్వాత తను పాకిస్తాన్ చేరాడు. ఈ విచిత్రమైన కాశ్మీర్ యుద్ధంలో వొచ్చి పడ్డాడు. కాలం వడివడిగా, ఉద్విగ్నంగా పరిగెత్తినట్లని పించింది రబ్‌నవాజ్‌కు. కానీ గడచిన యుద్ధాల పరమార్థం మాత్రం అతనికి అర్థంకాలేదు. యెవరో వ్యూహరచన చేస్తారు. మరెవరో సైన్యాన్ని నడిపిస్తారు. వ్యూహాలను అమలు పరుస్తారు. విరామం లేని సంగ్రామం సాగుతుంది. ఇందులో సాధారణ సైనికునికి ఆలోచించే అవకాశం వుండదు. ఏ ఒక్క విషయమూ అర్థం కాదు.

అయితే రబ్‌నవాజ్‌కు ఒక విషయం మాత్రం అర్థమయింది. తాము కాశ్మీర్‌ను గెల్చుకోవడానికి పోరాడుతున్నారు. కాశ్మీర్ తమ కెందుకు? ఎందుకంటే కాశ్మీర్ ఇప్పుడు పాకిస్తాన్ రక్షణ సమస్యగా మారిపోయింది కనుక. పాకిస్తాన్ ప్రాదేశిక మనుగడకు కాశ్మీర్ అవసరంకనుక.

కానీ, తుపాకీ యుద్ధరంగంలో తుపాకీ యెక్కు పెట్టి గురిచూస్తున్నప్పుడు యెదురుగా పరిచయమైన ముఖాలు కనిపించగానే రబ్‌నవాజ్ క్షణకాలం నిర్వీణ్ణుడైపోతాడు. తను చేస్తున్న పోరాటం ఎందుకో అర్థంకాదు. తుపాకీ యెందుకు మోస్తున్నట్టు? ప్రజలను యెందుకు చంపుతున్నట్టు? రబ్‌నవాజ్ బుర్రలో యుద్ధం మొదలౌతుంది. కల్లోలం రేగుతుంది. ఆ సమయంలో రబ్‌నవాజ్ ఒక నిశ్చయానికి వొస్తాడు. తను పోరాడుతున్నది మెడల్స్‌కోసంకాదు, జీతనాదాలకోసం కాదు. మరి? దేశ రక్షణకోసం, మాతృదేశం మనుగడకోసం!!

పాకిస్తాన్ యేర్పడక ముందుకూడా ఈప్రదేశం తనదే! ఈనేలా, ఈ ఆకాశం ఈగాలీ తనదే! విచిత్రమేమిటంటే-తనిప్పుడు యుద్ధం చేస్తున్నవారుకూడా క్రితం దినం వరకు తనదేశస్తులే! తనవాళ్లే. తనవూరిలో, తనతోపాటే పుట్టి పెరిగిన వాళ్లే! వాళ్ళ కుటుంబాలు, తనకుటుంబం తరాల తరబడి కలిసి మెలిసి కొనసాగుతూ వొచ్చాయి. ఇప్పుడు-వాళ్ళంతా పరాయి దేశస్తులై

పోయారు. ఒక కొత్త రాజ్యం పౌరులై పోయారు. పూర్తి అపరిచితుల్లాగా మారి పోయారు. అంతకుమించి శత్రువులై పోయారు.

ఇంతకీ ఇప్పుడు కొత్తగా యేర్పడిన దేశం తనకు తెలుసా? రబ్ నవాజ్ బుర్రలో ఆలోచనలు సుళ్ళు తిరుగుతున్నాయి. దేశరక్షణకోసం పోరాడమని పంపారు తనని. చేతిలో ఒక తుపాకీ పెట్టారు. ఇంతకీ ఆదేశం ఎట్లా వుంటుంది? అక్కడ తనకు నిలువడానికి జానెడు జాగా, తలదాచుకోవడానికి దోసెడు నీడా వుంటాయా? ఏమో!

తమ ఆస్తులను, అనాదినుంచి వచ్చిన తమసర్వాస్వాన్నీ వొదిలేసికొత్త దేశానికి తరలిన ముస్లిం సైనికులు రబ్ నవాజ్ మనసులో మెదిలారు. వాళ్ళంతా తెలియని స్వదేశానికి జోడుచేతులతో వెళ్ళారు. కానీ వాళ్ళకేం దొరికింది? ఏం వొరిగింది? ఒక నిర్జీవమైన తుపాకీని చేతిలో పెట్టారు! వారికి సుపరిచిత మైన తుపాకులే! అదే తయారీ. అదే బోర్. కానీ శత్రువు మాత్రం కొత్త!

దేశ విభజనకంటే ముందు తనూ, వాళ్ళు కలిసి ఒక ఉమ్మడి శత్రువుతో పోరాడారు. ఎవరా శత్రువు? ఉపాధికొసం, రివార్డులకోసం, మెడల్స్ కోసం శత్రువుగా అంగీకరించిన శత్రువు. అప్పుడు తామంతా భారత సైనికులు! ఇప్పుడు కొందరు పాకిస్తాన్ సైనికులై పోయారు. ఇలా జరుగడానికి కారణమేమిటో రబ్ నవాజ్‌కు అర్థం కావడంలేదు! ఒక పజిల్ లాగా బిగుసుకుంటుంది. వెంటనే అతణ్ణి పాకిస్తాన్ ఆలోచనలు ముసురుకుంటాయి. అప్పుడు మరింత అయోమయపడతాడు.

ఇంతకీ పాకిస్తాన్ సైనికులు కాశ్మీర్ కోసం పోరాడుతున్నారా? లేక కాశ్మీర్ ముస్లింల కోసం పోరాడుతున్నారా? కాశ్మీర్ ముస్లింలు ఎవరైనా తమకోసం పోరాటం చేయమని వీళ్ళని అడిగారా? ఒకవేళ అదే నిజమయితే హైదరాబాద్, జునాఘర్ ప్రిన్స్‌లీ స్టేట్స్ కోసం ఎందుకు పోరాడ్డంలేదు? నిజంగానే ఇదొక ఇస్లామ్ యుద్ధమైతే ప్రపంచంలోని మిగతా దేశాల ముస్లిం సైనికులు యెందుకు వీరికి భుజం భుజం కలిపి పోరాడడం లేదు.

రబ్ నవాజ్ చివరకో నిశ్చయానికి వొచ్చాడు. ఇవి చాలా సూక్ష్మమైన విషయాలు. సాధారణ సైనికుల బుర్రకు అందవు. సైనికుడు ఎంత మంద

బుద్ధి గలవాడైతే అంతమంచిది, అప్పుడే మంచి సైనికుడయ్యే అవకాశం వుంటుంది. ఈ నిశ్చయానికి వొచ్చాక రబ్‌నవాజ్ స్థిమిత పడతాడు.

తను పోరాటం చేస్తున్న ప్రదేశం పేరు లిక్విల్ సెక్టార్. కిషన్‌గంగా నదికి అడ్డంగా ముజఫర్‌బాద్ నుంచి కిరణ్‌కు వెళ్ళే రోడ్డుపొడవునా వ్యాపించి వుంది. చుట్టుపక్కల కొండలున్నాయి.

ఈ కాశ్మీర్ యుద్ధం విచిత్రమైనదే కాదు. కొత్తరకమైనది కూడా. ఈ యుద్ధంలో తుపాకీ మోతల కన్నా కారుకూతలు, బూతుమాటలే యెక్కువ వినిపిస్తాయి. ఇరువర్గాల సైనికులు బూతులతోనే తలపడతారు. దిక్కులు పిక్కటిల్లేలా పెద్ద పెద్ద గొంతులతో ఒకరినొకరు తిట్టుకుంటారు.

ఒక రోజున బాగా పొద్దుపోయాక సుబేదార్ రబ్‌నవాజ్ శత్రుకైవారాన్ని ఛేదించడానికి తన ప్లెటూన్ సిద్ధం చేస్తున్నాడు. పక్కనే వున్న కొండమీదినుంచి వున్నట్టుండి పెద్దపెట్టున అరుపులు వినిపించాయి. రబ్‌నవాజ్ ఆశ్చర్యపోయాడు. ''పంది వెధవల్లారా!'' అని ఎవరో తిడుతున్నారు. ఆ వెంటనే గట్టిగా నవ్వులు. వికటట్టహాసాలు.

''పంది వెధవలు'' రబ్‌నవాజ్ మనసులోనే తిట్టుకున్నాడు. ''ఇంతకీ ఇక్కడ ఏంజరుగుతుంది? ఇది యుద్ధమేనా''

ఇంతలో తన బృందంలోంచి కూడా కొందరు తిట్లకు లంకించుకున్నారు. గొంతు చించుకుని కసికొద్దీతిట్లయుద్ధం సాగుతోంది. ''సుబేదార్ సాబ్! వింటున్నారా? తల్లిని చెరిచే నా కొడుకులు మళ్ళీ మనల్ని తిడుతున్నారు'' అని తనకు ఫిర్యాదు చేశారు.

రబ్‌నవాజ్‌కు ఆ తిట్ల పోరాటంలో గొంతుకలపాలని తొలుత అనిపించింది. కానీ తమాయించుకున్నాడు. ఇంతలో ఇరువైపులనుంచి తిట్లు ఆగిపోయాయి. అంతా నిశ్శబ్దం ఆవహించింది. తిట్ల వర్షం వెలిసిందనుకున్నాడు రబ్‌నవాజ్. కానీ అదిక్షణకాలమే. మళ్ళీ అవతలి వేపునుంచి కారుకూతలు వినిపించాయి. ఈసారి తిట్లు భరించరాని విధంగా వున్నాయి తన సైన్యంకూడా అదుపుతప్పుతోంది. ఒకటి రెండు సార్లు రబ్‌నవాజ్ తనవారిని

వారిచే ప్రయత్నం చేశారు. ఎవరూ అతడిమాటని లెక్కచేసే స్థితిలో లేరు తను వాళ్ళని ఆపగలడా? ఇటువంటి సమయాల్లో రెచ్చిపోకుండా వుండడం ఎవరికైనా సాధ్యమా? ఇది అమానుష విషగడియ! నోరుమూసుకోవడం మానవ మాత్రుల తరంకాదు.

ఆ ప్రదేశమంతా దట్టమైన అడవి వ్యాపించివుంది, చెట్లమాటున పొంచి వున్న శత్రువులు కనిపించరు. పగటిపూటకూడా శత్రువు జాడని కనిపెట్టడం అసాధ్యం ఆ అడవిలోంచి తిట్లుమాత్రం ఎగజిమ్ము కొస్తున్నాయి. కొండలు, కోనలు, లోయలు, మిట్టలు అంతా తిట్లలో ప్రతిధ్వనిస్తోంది. వాతావరణమంతా చిందిన బురదగుంటలా తయారయింది.

ఆ ప్రదేశం లోని కొండలు కొన్ని ఎత్తయిన దేవదారు వృక్షాలతో నిండివున్నాయి. మరికొన్నింటిపై పనికిరాని చెట్లు పెరిగి వున్నాయి. రబ్‌నవాజ్ ప్లెటోన్‌వున్న చోటుమరీ ఏ ఆచ్ఛాదనాలేని బయలు ప్రదేశం. కనుచూపుమేరలో ఎక్కడా ఒక్క చెట్టు కూడాలేదు. రబ్‌నవాజ్ సైన్యంలో క్షణక్షణానికీ అసహనం పెరుగుతోంది. అవిరామంగా వినిపిస్తున్న తిట్లు వారిని రెచ్చగొడుతున్నాయి. వాళ్ళు ఎప్పుడు దాడి చేద్దామా అని ఎదురుచూస్తున్నట్లున్నారు. ప్రతీకారవాంఛతో కుతకుత లాడి పోతున్నారు. రబ్‌నవాజ్ ఒకవ్యూహం పన్నాడు. దాని ప్రకారం దాడి జరిగింది తనవైపు ఇద్దరు సైనికులు చనిపోయారు నలుగురుగాయపడ్డారు. శత్రువుక్కూడా నష్టం జరిగింది. అవతలవేపుముగ్గురు ప్రాణాలు కోల్పోయారు. అంతకన్నా శత్రుసైనికులు చెల్లా చెదరైపోయారు. రబ్‌నవాజ్ అంచనా ప్రకారం శత్రు సైన్యం అన్నపానాలకు దూరమై వుండాలి.

ఇంత దాడి జరిగినా రబ్‌నవాజ్ సైన్యం శత్రువుల్లోంచి ఒక్కరినికూడా బందీగా పట్టుకోలేకపోయింది. కానీ కొన్ని ముఖ్యమైన రహస్యాలను కనుక్కోగలిగారు. రబ్‌నవాజ్ తాముసేకరించిన సమాచారాన్ని తమ కమాండర్ మేజర్ అస్లాంకు తెలియపర్చాడు.

రబ్‌నవాజ్ సైన్యం ఈ దాడిలో తామున్న ప్రదేశంనుంచి ముందుకు వొచ్చింది. అక్కడ ఒక కొలను కనిపించింది. దాన్ని వారు స్వాధీనం చేసుకున్నారు. ఆకొలను చల్లని తేటనీటితో నిండివుంది. నీళ్ళు చాలా తియ్యగా

కూడావున్నాయి. సైన్యానికి ప్రాణం లేచి వొచ్చినట్టయింది. అంతే వొక్క సారిగా అందరూ బట్టలునిప్పేసి కొలనులోకి దూకారు.

ఆదేసమయంలో హఠాత్తుగా కాల్పుల శబ్దంవినిపించింది. ఒక్క ఉదుటున అందరూ కొలనులోంచి బయటికివొచ్చారు. సుబేదార్ రబ్‌నవాజ్ బైనాకులర్స్‌తో ఓసారిచుట్టూ పరిశీలించాడు. జాగ్రత్తగా ఆప్రాంతాన్ని చూపులతోనే సర్వే చేశాడు. శత్రువుజాడ అతనికి కనిపించలేదు. కాల్పులు మాత్రం జరుగుతూనే వున్నాయి. ఆకాల్పులు ఎక్కడినుంచి జరుగుతున్నాయో రబ్‌నవాజ్‌కు క్రమంగా అర్థంకాసాగింది. తామున్న ప్రదేశానికి కొన్ని వందల అడుగుల దిగువన ఒక చిన్న కొండమీదినుంచి కాల్పులు జరుగుతున్నాయని నిర్ధారణకు వొచ్చాడు. ఆకొండమీద శత్రువు దాక్కోవడానికి ఏమాత్రం అవకాశం లేదు.శత్రువక్కడ ఏంతో కాలం నిలవలేడని రబ్‌నవాజ్‌కు అనిపించింది.

రబ్‌నవాజ్ సైనికులు ముందుకు దూసుకెళ్ళడానికిసిద్ధమయ్యారు. కొద్ది సేపట్లో శత్రువు తమకు ఎదురుపడతాడని వారి అంచానా.

ఏకపక్షంగా సాగుతున్న కాల్పులు క్రమంగా ఎదురుబదురు కాల్పులుగా మారుతున్నాయి. రబ్‌నవాజ్ మందుగుండు సామాగ్రిని వృధా చేయొద్దని తనవారిని ఆదేశించాడు.శత్రువు ఎప్పుడు బయటికి వస్తాడాఅనిఎదురుచూడ సాగారు.

రబ్‌నవాజ్ తనవైపు చూసుకుని ఆశ్చర్యపోయాడు. తాను నొంటిమీద నూలుపోగు లేకుండా నగ్నంగావున్నాడు. 'బట్టలు లేక పోతే మనుషులు ఎంత అసహ్యంగా వుంటారో. 'పందివెధవలు!!'అను కున్నాడు మనసులో.

ఇలా రెండు రోజులు గడిచిపోయాయి.

ఉన్నట్టుండి కాల్పులు జరగడం, మళ్ళీ నిశ్శబ్దమైపోవడం అంతా వొక ఆటలాగా సాగింది.

వాతావరణం హఠాత్తుగా మారిపోయింది. ఉష్ణోగ్రత చాలా డిగ్రీలుపడిపోయింది. చలి మొదలయింది. అంతా వజవజా వణికి పోతున్నారు. చలి నుంచి కాపాడుకోవడానికి టీకెటిల్‌ను రాజేసివుంచమని రబ్‌నవాజ్ తనవారికి

చెప్పాడు. టీ అవిరామంగా మరుగుతోంది. వాతావరణంలో వచ్చినమార్పు యుద్ధాన్ని అంతంలేని టీపార్టీలా మార్చివేసింది!

మూడోరోజుకు చలి భరించరాని స్థాయికి చేరుకుంది. ఇప్పుడు శత్రువు పరిస్థితి ఏమిటా అని రబ్‌నవాజ్ సైనికులు, అంచనా వేస్తున్నారు. రబ్‌నవాజ్ బైనాకూలర్‌తో చుట్టూ పరిశీలిస్తున్నాడు. కొంచెం దూరంలో ఏదో కదలిక కనిపించింది. రబ్‌నవాజ్ రైఫిల్ అందుకున్నాడు. గురిచూసి పేల్చాడు. అటువైపునుంచి ఎవరో తనని పేరుపెట్టి పిలుస్తున్నారు. నిజంగా పిలుస్తున్నారా? తను భ్రమపడుతున్నాడా? రబ్‌నవాజ్‌కు అర్థంకాలేదు. ఆపిలుపు ఒకలోయలోంచి మళ్ళీ వినిపించింది.

'పంది వెధవా? ఎవ్వడా పిలిచేది! ఏం కావాలి? రబ్‌నవాజ్ గట్టిగా అరిచాడు.

'సోదరా! తిట్టకు' అటునుంచి అభ్యర్థనపూర్వకంగా ఇందాకా రబ్‌నవాజ్‌ను పిలిచిన కంఠమే గట్టిగా బదులు పలికింది.

రబ్‌నవాజ్ తన సైనికులకేసి చూచాడు.

"సోదరా! ఇక్కడ నీ సోదరులెవరూలేరు. నీఅమ్మ మొగుళ్ళున్నారు" రబ్‌నవాజ్ బిగ్గరగా అరిచాడు.

"రబ్‌నవాజ్" మళ్ళీ అదే పిలుపు వినిపించింది.

రబ్‌నవాజ్ ఈసారి క్షణకాలం చలించిపోయారు. అతనిలో సన్నటి వొణుకు పుట్టింది, అవతలి వ్యక్తి పిలుపు గాలిలో గింగిరాలు తిరిగి వాతావరణంలో కలిసిపోయింది.

'పందివెధవలు' తిట్టుకున్నాడు రబ్‌నవాజ్.

ఇంతకీ తనని పేరుపెట్టి పిలుస్తున్నదెవరు? రబ్‌నవాజ్ ఆలోచనల్లో పడ్డాడు.

టిట్వ సెక్టర్‌లో మోహరించివున్న శత్రువుల్లోని సైనికులంతా దాదావు 'పాత 6/9 రెజిమెంటు' వాళ్ళే, అది తన పాత రెజిమెంటు. ఆ రెజిమెంటులో తనకు చాలామంది మిత్రులేవున్నారు. ఈపరిస్థితిలో తనని 'సోదరా' అని పిలిచిన జోకరెవరు?

రబ్‌నవాజ్ బైనాకులర్స్‌తీసి నిశితంగా చుట్టూ పరిశీలించి చూశాడు! ఎవరూ అతనికి కనిపించలేదు. అతని ఉత్కంఠ పెరిగింది. ''ఎవరక్కడ. రబ్‌నవాజ్‌ను నేనే! ఏంలోవాలి?'' అని గట్టిగా అరిచాడు.

''రబ్‌నవాజ్! నేను. రాంసింగ్‌ను''. ఇందాక పిలిచిన కంఠమే బదులు పలికింది.

రబ్‌నవాజ్ దాదాపు ఎగిరిగంతేసినంత పనిచేశాడు. ''రాంసింగ్! వారే రాంసింగా! నువ్వట్రా పందివెధవా?'' అన్నాడు.

''నోర్ముయ్యరా. కుమ్మరిగాడిదా! నేనే!'' అటునుంచి సమాధానం వినిపించింది.

రబ్‌నవాజ్ తన సైనికులవైపు చూశాడు. యుద్ధరంగంమధ్యలో శత్రుసైన్యాలకు చెందిన ఇద్దరిమధ్యసాగుతున్న ఈ సంభాషణ విని వాళ్ళు ఆశ్చర్యపోతున్నారు.

''ఆవెధవ యేదో కుళ్ళు వాగుతున్నాడు. పందివెధవ" అని తనవారితో అన్నాడు. ''నోరుముయ్యరా, కసాయినాకొడకా!'' అని రాంసింగ్‌నుద్దేశించి అరిచాడు.

రాంసింగ్ నవ్వాడు. రబ్‌నవాజ్ నిశ్శబ్దంగా వుండిపోయాడు. అతని సైనికులూ మౌనం వహించారు.

''చూడుమిత్రమా! చలితో వణికిపోతున్నాం. కొంచెం టీ తాగాలి'' రాంసింగ్ నెమ్మదిగా అభ్యర్థించాడు.

''తాగు'' అన్నాడు రబ్‌నవాజ్.

''మేం తాగలేం. టీ చేసుకునే సామాగ్రంతా ఎక్కడో పడిపోయింది.''

''ఎక్కడ''

''నన్ను వెళ్ళనిస్తే తెచ్చుకుంటా. మేం పైకిలేవాలంటే మామీదున్న కవర్స్ తొలగించాలి. తొలగిస్తే మీరు కాలుస్తారు''

''అయితే నన్నేం చేయమంటావురా పందీ''

''మాలో ఎవరో వొకరు వెళ్ళి టీ సామాగ్రి తెస్తారు నీవు కాల్పులు జరపకూడదు''.

''అయితే సరే! వెళ్ళండి''.

''నీమాటలు నమ్మిందెవరు? నీవు మమ్మల్ని కాల్చేస్తావు! కుమ్మరి వెధవా!'' అన్నాడు రాంసింగ్.

''నోరుముయ్యరా సిక్కుతాబేలూ!'' అన్నాడు రబ్‌నవాజ్.

''ఫైర్ చెయ్యనని ముందు నీవు ప్రమాణం చెయ్యాలి''

''దేనిమీద ప్రమాణం చేయాలి?''

''నీ ఇష్టం''

''రబ్‌నవాజ్ పెద్దగా నవ్వాడు. ''భయం లేదు. నేను మాటయిస్తున్నాను. వెళ్ళు వెళ్ళి నీ సామాను తెచ్చుకో'' అన్నాడు.

కొద్ది నిమిషాలు ఏమి జరగలేదు. అంతా నిశ్శబ్దం. రబ్‌నవాజ్ మనుష్యుల్లోంచి ఒకతను బైనాకులర్స్‌తో చూస్తున్నాడు. అతని చేతిలో తుపాకీ వుంది. గురిచూసే ప్రయత్నంలో వున్నాడు. 'వద్దు, వద్దు. కాల్పులు జరపవద్దు'' అని రబ్‌నవాజ్ అతణ్ణి వారించాడు.

ఇంతలో అవతలివేపునుంచి వొక వ్యక్తి వొంగివొంగి పొదలమాటున పరిగెత్తాడు. మరి కాసేపట్లో తిరిగివచ్చాడు. అతని చేతిలో ఏదోసామానుంది. తిరిగి పొదల మాటుకు వెళ్ళిపోయాడు. రబ్‌నవాజ్ రైఫిల్ తీసుకుని పేల్చాడు. ప్రతిగా-

''ధన్యవాదాలు'' రాంసింగ్ కంఠం వినిపించింది.

''పరవాలేదు'' రబ్‌నవాజ్ జవాబిచ్చాడు

రబ్‌నవాజ్ ఆదేశాల మేరకు కాసేపు కాల్పులు జరిగాయి. ఆకాల్పులు యుద్ధంలో పరస్పరం శత్రుసైన్యాలు జరిపే కాల్పుల్లాలేవు. తమాషా కోసం జరుపుకునే కాల్పుల్లా వున్నాయి. రబ్‌నవాజ్‌కు ఒక చోటినుంచి సుడితిరుగుతూ పైకిలేస్తున్న పొగలు కనిపించాయి.

''రాంసింగా! టీ తయారయిందా?'' రబ్‌నవాజ్ కేకేశాడు.

"కాలేదోయ్ కుమ్మరి గాడిదా !''

రబ్‌నవాజ్ కులానికి కుమ్మరివాడు. ఎక్కడయినా తనకుల ప్రసక్తి ఎవరైనా తెస్తే అతనికి కోపం వస్తుంది. ఎదుటివారు ఎవరైనాసరే సహించడు. కానీ, రబ్‌నవాజ్‌ను కులంపేరుతో పిలిచి, తిట్టి నిలవగలిగినవాడు రాంసింగ్ వొక్కడే. పంజాబ్‌లో రబ్‌నవాజ్, రాంసింగ్ ఇద్దరూ కలిసి బతికారు. ఒక స్కూల్లో చదివారు. దాదాపు ఇద్దరిదీ ఒకే వయసు. వారి తలిదండ్రులు కూడా స్నేహితులే. రబ్‌నవాజ్, రాంసింగ్ ఒకేసారి సైన్యంలో చేరారు. ఇప్పటిదాకా ఇద్దరూ కలిసి యుద్ధం చేశారు. కానీ, ఇప్పుడు ఈ కాశ్మీర్ యుద్ధంలో.... శత్రువులై పోయారు!

''నోరుముయ్యరా పేనుకొరికిన గాడిదా!" అని బిగ్గరగా అరిచాడు రబ్‌నవాజ్. తనవారి వైపుతిరిగి ''ఈ రాంసింగ్ వెధవవున్నాడే! వాడు ఆశ పోతు వెధవ దేన్నీ వొదిలిపెట్టడు'' అన్నాడు.

ఇంతలో దూరంగా ఎవరో లేచి నిల్చున్నట్టు కనిపించింది. రబ్‌నవాజ్ వెంటనే రైఫిల్ ఎత్తి కాల్చాడు అటువైపు నుంచి ఆర్తనాదం వినిపించింది. రబ్‌నవాజ్ బైనాకులర్స్‌లోంచి చూశాడు పెద్దగాయంతో రాంసింగ్ కనిపించాడు కడుపును రెండుచేతులతో పట్టుకుని నేలమీద పడిపోయాడు.

''రాంసింగ్" -రబ్‌నవాజ్ కంఠనాళం తెగిపోయేలా అరిచాడు. అటు వైపునుంచి కాల్పులు మొదలయ్యాయి. కాల్పులు క్రమక్రమంగా పెరుగుతున్నాయి. ఒక బుల్లెట్ రబ్‌నవాజ్ ఎడమచేతిని రాసుకుంటూ రివ్వున దూసుకు పోయింది. రబ్‌నవాజ్ వొడుపుగా నేలమీదికి పడిపోయాడు. కొద్దిసేపు గందర గోళం రాజ్యం చేసింది. ఈ పరిస్థితిని శత్రువు అదునుగా తీసుకో జూస్తున్నాడు. శత్రు సైనికులు ముందుకు దూసుకోచ్చే ప్రయత్నం చేస్తున్నారు. బహిరంగ ప్రదేశంనుంచి రక్షిత ప్రదేశాలకు వెళ్తున్నారు. పొజిషన్ చూసుకుంటున్నారు. వెంటనే రబ్‌నవాజ్ కొండని చుట్టు ముట్టవలసిందిగా తన ప్లెటూన్‌ను ఆదేశించాడు. వాతావరణం భయోద్విగ్నంగా మారిపోయింది. ముగ్గురు సైనికులు నేలకొరిగారు.

రాంసింగ్ నేలమీద పడివుండడం రబ్‌నవాజ్‌కు కనిపించింది. అతని కడుపులో పెద్ద గాయామే అయింది. రాంసింగ్ కళ్ళు తెరిచి రబ్‌నవాజ్‌ను చూశాడు. "రబ్‌నవాజ్! కుమ్మరి గాడిదా! ఎంతపని చేశావురా!" అన్నాడు.

తాను తుపాకీ పేల్చించి రాంసింగ్ మీదేనని రబ్‌నవాజ్‌కు అర్థమైంది. రాంసింగ్ బెల్టును వొదులు చేసుకోవడానికి తిప్పలుపడుతున్నా "రాంసింగ్! నిన్ను లేచినిలబడమని ఎవరు చెప్పార్రా?" అన్నాడు.

"నీకు నామొహం చూపిద్దామనే ప్రయత్నంలో పైకిలేవబోయాను. ఇంతలో నీవు తుపాకీ పేల్చావు." రాంసింగ్ అతికష్టం మీద సమాధానం చెప్పాడు. రబ్‌నవాజ్ రాంసింగ్ దగ్గరికివెళ్ళి అతని బెల్టు వదులు చేయడంలో సహకరించాడు. గాయం భయానకంగా వుంది రక్తం విపరీతంగా వస్తోంది.

రబ్‌నవాజ్‌కు నోట మాటరాలేదు. ఊపిరి ఆగిపోయినంత పనయింది. "దేవుని మీద వొట్టు! నేను తమాషాకి కాల్చాను అదినువ్వని తెలీదు! నాకెట్లా తెలుస్తుంది చెప్పు! రాంసింగ్ నిజంగా నువ్వు గాడిదవిరా!" అన్నాడు రబ్‌నవాజ్.

రాంసింగ్‌కు రక్తం ఆగడం లేదు.

అంత పెద్దగాయమై, అంతకంత రక్తంపోతున్నా రాంసింగ్ ఇంకా బతికి వుండడం రబ్‌నావాజ్‌ను ఆశ్చర్య పరిచింది. రాంసింగ్‌ను కదిలించాలని అని పించలేదు వైర్‌లెస్‌లో తన కమాండర్ మేజర్ అస్లాంతో మాట్లాడాడు. వెంటనే వైద్య సహాయం కావాలని అడిగాడు.

డాక్టర్‌రావడానికి చాలా సమయం పడుతుందని రబ్‌నవాజ్‌కుతెలుసు అయినా "రాంసింగ్ భయంలేదు డాక్టర్ వస్తున్నాడు" అని ధయిర్యం చెప్పాడు.

"నేనేం భయపడడం లేదు గాని, ఒక విషయం చెప్పు నీవు నా మనుషుల్ని ఎంతమందిని చంపావు" హీనమైన స్వరంతో అడిగాడు రాంసింగ్.

"ఒకరిని" రబ్‌నవాజ్ చెప్పాడు.

"నీ వాళ్లెంతమంది చనిపోయారు"

"ఆరుగురు"

'ఆరుగురు' రాంసింగ్ గొణుక్కున్నాడు. "నేను కిందపడిపోగానే మావాళ్ళు అధయిర్య పడ్డారు. నేను కాళ్ళులు జరపండని చెప్పాను. మీకున్న శక్తినంతా ఉపయోగించి పోరాడమని చెప్పాడు'' అన్నాడు రాంసింగ్ ఆ తర్వాత రాంసింగ్ తన స్వగ్రామం గురించి మాట్లాడాడు. చిన్ననాటి కబుర్లు గుర్తుకు వొచ్చాయి. క్రమంగా మెదడు పనిచేయడం మొదలు పెట్టింది. స్కూలు.... చదువులు. స్నేహాలు.. ఆతర్వాత 6/9 రెజిమెంటు.. ఇట్లా ఎన్నో విషయాలు చెప్తున్నాడు. పేరుకూడా తెలియని నగరాలలో కొత్త స్త్రీలతో తమ ప్రేమ వ్యవహారాలు చెప్పాడు.

రాంసింగ్ గాయం భరించరాని విధంగా సలుపుతోంది. అయినా మాట్లాడుతూనే వున్నాడు.

''రబ్‌నవాజ్! నీకు ఆ మేడం గుర్తుందికదా!''

''ఏ మేడమ్''

"ఇటలీలో వుండేది. ఆమెను మనమంతా మాన్ ఈటర్ అని పిలిచే వాళ్ళం''

రబ్‌నవాజ్‌కు గుర్తొచ్చింది.

''అవును గుర్తుంది. ఆమెను మేడమ్ మినీ టఫాంటో అనో, మరో పేరుతోనే పిలిచే వాళ్ళం. డబ్బులేదు పనిలేదుఅని ఆమె అంటూవుండేది. ఆమెకినువ్వంటే కొంచెం ఇదివుండేది'' జ్ఞాపకంచేసుకుంటు చెప్పాడురబ్‌నవాజ్.

రాంసింగ్ పెళ్ళున నవ్వాడు. అనవ్వుకు శరీరమంతా కదిలి ఒక్కసారిగా గాయంలోంచి రక్తం బైటికి పెళ్ళుబికింది. రబ్‌నవాజ్ ఏదో విధంగా గాయానికి కట్టుగట్టాడు. కదలకుమని రాంసింగ్‌తో చెప్పాడు.

రాంసింగ్ వొళ్ళంత మంటలు మంటలుగా వుంది. మాట్లాడే శక్తి క్రమంగా సన్న గిల్లుతోంది.కూడదీసుకుని కూడదీసుకునిమాట్లాడుతోనేవున్నాడు అప్పుడప్పుడు అతనికి స్పృహకూడా తప్పుతోంది. అపస్మారక స్థితిలోకి వెళ్తున్నాడు సంధిప్రేలాపనల్లా ఏమిటేమిటో మాట్లాడు తున్నాడు. మళ్లీ అంతల్లోకే అతనికి స్పృహవస్తోంది. మామూలై పోతున్నాడు. స్పృహలోకి వచ్చినప్పుడు రాంసింగ్‌రబ్‌నవాజ్‌నుఅడిగాడు. ''నిజం చెప్పు. మీరు నిజంగా కాశ్మీర్ కావాలనిగట్టిగా కోరు కుంటున్నారా?''

''అవును రాంసింగా!''

''నేన్నమ్మను. నిన్నెవరో మిస్‌లీడ్ చేశారు'' రాంసింగ్ అన్నాడు.

''లేదు నువ్వే మిస్‌లీడ్ అయ్యావు. నేను దేవునిమీద ప్రమాణం చేసి చెప్తున్నాను. మేంనిజంగానే కాశ్మీర్ కావాలని కోరుకుంటున్నాము" రబ్‌నవాజ్-

'వొద్దు వొద్దు వొట్టుపెట్టుకోవొద్దు నీవు నిజమేకావొచ్చు' ఏదో వింత దనం కనిపించింది. దాని అర్థమేమిటో రబ్‌నవాజ్‌కు బోధపడలేదు.

పొద్దుగొంకుతుండగా మేజర్ అస్లాం వొచ్చాడు. అతని వెంట కొందరు సైనికులు ఉన్నారు కానీ డాక్టర్ మాత్రంలేడు. రాంసింగ్ చావుబతుకుల మధ్య ఉన్నాడు. అతనికి అప్పుడప్పుడు స్పృహ వస్తోంది. పోతోంది. ఏదేదో గొణుక్కుంటున్నాడు.

మేజర్ అస్లాం 6/9 రెజిమెంటులో చాలాకాలంగా అధికారి. రాంసింగ్ అతని కింద పనిచేశాడు. మేజర్ అస్లాం రాంసింగ్ మీదికి వొంగి ''రాంసింగ్! రాంసింగ్'' అని పిలిచాడు.

రాంసింగ్ కళ్ళు తెరిచాడు. తనకన్నా పెద్ద అధికారి కనిపించినపుడు సాధారణంగా సైనికులు అలవాటుగా అటెన్షన్‌లోకి వొచ్చినట్టురాంసింగ్ శరీరం మేజర్ అస్లాంనుచూడగానే అటెన్షన్‌లోకి వొచ్చింది. రాంసింగ్ చేయెత్తి సైనిక వందనం చేశాడు. అలా చేయడానికి అతడు చాలా కష్టపడవలసి వొచ్చింది. వెంటనే అతని మొహం అచేతనమైపోయింది. ఎత్తిన చేయి పక్కకు వాలి పోయింది.

''రాంసింగా! గాడిదా! ఇదియుద్ధంరా! యుద్ధమని మర్చి పోతున్నావురా! ఇదియుద్ధంరా! యుద్ధం.. ఇది యుద్ధం.. ఇ..'' రాంసింగ్ మాటలు పూర్తికాలేదు. తనకు తానుగా చెప్పుకున్న ఆమాటలు పూర్తికాకముందే అతని కళ్ళు మూతలు పడుతున్నాయి. అర్ధనిమీశితనేత్రాలతో రాంసింగ్ రబ్‌నవాజ్ వైపుచూశాడు. ఆతర్వాత అతను ఆఖరివూపిరి పీల్చాడు. రాంసింగ్ చనిపోయాడు.

# మా ఊరు మారి పోయింది

శోధన్

మా వూరు మారి పోయింది
భౌగోళికంగా కాదు
భౌతికంగా,
ఆకారంలో కాదు
సహకారంలో
సాటి మనిషి సమస్య పరిష్కారంలో
ఒకప్పుడు—
నిద్రాణమై పురాగోదిల్లాలయిన వాళ్ళు
జీవితమే సమస్యగా బ్రతికినవాళ్ళు
అడవుల్లో ఆటవికుల్లా గడిపిన వాళ్ళు
జీర్ణ వస్త్రాల మలిన దేహాల వాళ్ళు
జీవచ్ఛవాలుగ మిగిలిన వాళ్ళు
వెట్టి చాకిరి ఉక్కు పాదాల క్రింది నలిగిన వాళ్ళు
ఇప్పుడు —
చైతన్యాన్ని రక్తంగా పారిస్తూ
రక్తాన్ని పాటలుగా కట్టి
నరాల సంగీతాన్ని
కనుగుడ్ల ఎరుపుతో పలికిస్తున్నారు
త్యాగాలనే ఊపిరిగా
స్వేచ్ఛనే మొక్కలుగా పండిస్తున్నారు
నిజంగా మా ఊరు ఎంత మారి పోయింది ?
రచ్చబండ కచ్చేరు మీద
గ్రామ దొర గాండ్రించడం లేదు
తప్పుడు లెక్కలు రాసే కరణం జిత్తులు
చిత్తు గావించ బడ్డాయి

వడ్డీ, చక్రవడ్డీలచే సామాన్యుని
నడ్డి విరగ్గొట్టె బంగారయ్యకు
శృంగ భంగం జరిగింది
రాత్రింబగళ్ళు దొర గడీలో
వెట్టిచాకిరీ ఉచ్చుల్లో చిక్కుకున్న
ఎంకన్న ఎలుగెత్తి 'పెత్తనమేందిరా' అని పాడుతున్నాడు
దొర దోపిడీ దుర్గం పగిలింది
యుగాలుగా, తరాలుగా
నల్లేరు పై బండిలా సాగుతున్న
సవారీకచ్చరం సీల ఊడింది

* * *

(ఇప్పుడిప్పుడే ఊపిరి పోసుకుంటున్న మెదక్ జిల్లాలోని మారుమూల పల్లె అయిన మా గ్రామానికి చాల రోజుల తర్వాత పోయినప్పుడు నాకు అక్కడ కనిపించిన పరిస్థితుల్ని చూసి ఇలా అన్పించింది.)

# సభ సాయుధమౌతుంది

— కోలపూడి

సభకుహాజరు కావటమే ఒక
సాహస యాత్ర అయినపుడు
హాజరైనవ్యక్తి ఖాకీకి
వాంటెడ్ పర్సన్ అయినపుడు
అది — రచయితల సభ అయితేనేమి,
రాడికల్ల సభ అయితే నేమి,
రైతు—కూలీ సభ అయితేనేమి,—
సభ— సాయుధమౌతుంది
గురితెలిసి పేలే ఆయుధమౌతుంది

అడవినడిబొడ్లో పేలినభూమి
గోదావరీ హృదయ కెరటానాదంలో లీనమై
మైదానాన్ని మేల్కొలిపి
అయిలయ్య, రాజలింగు నగర్ నిండా
పిడికిళ్ళే పరుచుకొన్నపుడు
అమరవీరులత్యాగం తొలిపొద్దై పొడుస్తుంది
అయిలయ్య, రాజలింగునగర్
ప్యాంస్ కమ్యూన్ అవుతుంది.
ఊరేగింపు లాంగ్‌మార్చ్ అవుతుంది
బహిరంగ సభప్రాంగణం విముక్తిప్రాంతమౌతుంది
సభ— సాయుధమౌతుంది
  గురితెలిసిపేలే ఆయుధమౌతుంది
కుక్కి మంచంలోని ముసలి పీనుగు
కత్తుల వంతెన మీంచిలఘించు కొచ్చినపుడు,
నిండు బాలింత నిప్పుల గుండంలో
తన గుండెను పూబంతిలా దొర్లించుకొంటూ సాగివచ్చి నపుడు
ఊగ తెలియని పసిపిల్లాడు
వడిశెల రాయై దూసుకొచ్చి నపుడు
అపుడు సభ— అమరవీరుని నెత్తుటి జ్ఞాపకమౌతుంది
  యుద్ధ రంగపు ఎత్తు గడఅవుతుంది.
అవును— సభ సాయుధమౌతుంది
  గురితెలిసిపేలే ఆయుధమౌతుంది
కను రెప్పల కింది తడి నెత్తురై గడ్డకట్టి
గుండెను తొలుచుకొని ఉప్పొంగినపుడు
పది అనుభవాలు ఒక్కదగ్గర పరుచు కొన్నపుడు
వందపూసులు పెనవేసుకొన్నపుడు
లక్ష ఆశలు ఒక్క ఆశయంగా రూపుదిద్దు కొన్న సమయాన
సభ— నియంత ముఖానికి పద్మ ముచ్చె మటవుతుంది
  మందు పాతరవుతుంది
  జైత్ర యాత్ర వుతుంది
  జన విజయానికి ఆచరణ ఇచ్చిన 'హామీ' అవుతుంది
నిజం— సభ శత్రువుపాలిట గోరీఅవుతుంది

[మే 5,6, తేదీల్లో వరంగల్‌లో జరిగిన రైతుకూలీ సంఘం శివ రాష్ట్ర మహా సభల స్పందనతో.........]

# జైలు నుంచి కొన్ని ఆలోచనలు కవితలు

జనవరి-ఫిబ్రవరి - 1990 మధ్య

—గౌతమ్

1) ఈ రోజు మైండ్ అంతా ఎందుకో బ్లాంక్‌గా అయిపోయింది. ఎందుకు అని తీవ్రంగానే ఆలోచించాను! కాని ఫలితం శూన్యం....

ఆకులు రాల్చిన వృక్షం
మృత్యు నిశ్శబ్దమైపోతుంది
నిజమే!
కొమ్మ చివరన జీవితం పచ్చరంగు తొడుగుతుంది
ఈరోజు ఏమీ లేని ఈ ఆకాశం మీద
సూర్యుడు వెలుగురేకల చైవాలు చేసినపుడు
అక్షరాలా మృత్యువే తిరిగి జీవిస్తుంది.—

రివిజనిజం తన అంతిమ దశను తప్పించుకోలేదు. కార్మికవర్గానికి కావాల్సిన స్వేచ్ఛ బూర్జువాకి కావాల్సిన స్వేచ్ఛ వొకటికాదు. కార్మికవర్గం తన స్వంత స్వేచ్ఛకోసం పోరాడక తప్పదు.

2. కా॥ నాగరాజు-కా॥ ప్రభాకర్ ఎన్‌కౌంటర్‌లో చనిపోయారనితెల్సింది. అసలే బాధతో వున్న హృదయం మరింతగా వణుకుతున్నది-

ఈ ఐదు పువ్వులు అడవి సిగలో
తురుముకున్న సూర్యులు
ఒక కాళరాత్రిని చెండాడి
ఒక వెల్గురేకల ఉదయాన్ని
ఉదయ ప్రభాతాల ప్రకాశాన్ని పంచడంకోసం
కాళరాత్రిలో మండిపోయాయి-
ఈ మంటలు రేపు అడవిలో నగరాల్లో
వెలుగునిచ్చే ఈనాటి మిణుగురులు—

3) టి.వి.లో 'విరసం' ఊరేగింపు...హృదయం ఒక్కసారి ఉప్పొంగి ఉరక తీసింది. (టి.వి.లో వేసినందుక్కాదు) పాల్గొనలేకపోయినా-కళ్ళతో చూడ గల్గినందుకు-

ఈ అగ్నిని తొలిసారి ఆవాహన చేసింది నువ్వే
అప్పటికింకా జన్మనిచ్చిన తల్లి
తన పొత్తిళ్ళలోని ఈ శిశువున తడుముకోనైనాలేదు-
తల్లి త్యాగాన్ని గుర్తు చేస్తూ నువ్వేసిన పొలికేక
ఎందర్ని కదలించిందనీ-
సంకెళ్లు పడ్డాయి-పాశీలువిరిగాయి
కాని నువు చిరంజీవివైనావు
మునుం వెంట మునుం ఘల్లు ఘల్లున సాగినట్లు
ఏటి వెంట ఏడు విప్లవానికి
నువు నాట్లేశావు—

4) నా ముందున్న ఈ తెల్ల కాగితంపైన ఏమి వ్రాయాలి?
యింతె మసిపూసి తెల్లకాగితాన్ని
నలుపు చేస్తావా?
ఆరిపోయిన నిప్పుని కాగితం మీద పూసినంత మాత్రాన
కాగితం మండుతుందా?
కాగితం మండాలి-జనానికది కావాలి
అందుకే నువ్ నిప్పుకణికనే
అక్షరాల్లో కూర్చి కాగితాన్ని మండించాలి—

ప్రతి కవితా జీవితం కాలేకపోయినా ప్రతి జీవితమూ కవిత! అందులో జైల్లో ప్రతి ఖైదీ కవే, ఎందుకంటే స్వేచ్ఛకోసం ఆ మనిషి ఆరాటమే కవిత్వం—

౫. కొత్త వాళ్ళస్తే-మొదట వచ్చి మనసంఖ్య పెంచినందుకు ఆనందం అరెస్టయ్యాడే అని బాధ. రెండోదాన్ని మొదటిది యిక్కడ డామినేట్ చేస్తుంగి. ఎందుకంటే మన సంఖ్య పెరిగే కొద్దీ బలం కూడా పెరుగుతుంది కదా!

ఒక రాక ఒక పోక
ప్రకృతికి సహజమే
జైలు కూడా సహజమే-
కాని జైలే ప్రకృతికి విరుద్ధం-

6) కనుబొమల మధ్య వెలరేగే సుడిగాలికి
ఒకరూపాన్నివ్వడానికి
మెదడుని చెరుగుతున్నాను-
కన్నీరింకిన నేల మీద
మొలకెత్తిన కత్తుల్ని అప్యాయంగా స్పృశిస్తాను
నెత్తుర్ని పారించి ఈ కత్తుల్ని సాకాలి...

7) మనుషులు తక్కువై పోయినకొద్ది పగలు పొడవు పెరిగిపోతుంది. కొత్త మనుషుల పరిచయం లేదు అనుకుంటాం కానిఎంతమందిని చదవలేదూ?

ఈ కాగితం పడవమీద
ప్రపంచమంతా చుట్టి వచ్చాను
యిది తుపాన్లకీ వాయుగుండాలకీ
గదిలో బంధించడానికీ
గోడల్లో నిలబెట్టడానికి జంకదు
కాగితం పడవలోనే అడవిహోరుని విన్నాను
ఈ పడవ తయారైంది అడివిలోనే కదా?

8) మెరిత మెరుపుని
గుప్పిట్లో పట్టి
కాగితం మీద ఛమక్ మనిపించాలి
కాని అది పాదరసం
అది అందీ అందని ఛక
చరిత్ర దరహాసం
యూరప్ విషాదం
యివ్వాళ ఆశియా దరహాసానికి
సంకేత మౌతున్నది—

9) కాశ్మీర్- కాశ్మీర్ నీవచ్చని ఆకుల మీద
నెత్తుటి జ్వాలలు రేస్తాయా?
నీమంచు మేలి ముసుగు
మానవ రక్తధారతో ఎర్రబడుతుందా?
కంకాళాల హారాన్ని నీ అపురూప సౌందర్యానికి
వేయాలని ఈ 'అన్నదమ్ముల' ప్రయత్నం—
కాశ్మీర్! కాశ్మీర్
నీ బిడ్డల్ని మేలు కొలుపు
వారి స్వాతంత్ర్యాన్ని వారే తెచ్చుకోమను—

10. ఇది చీకటి కాదు
ఇది కుహరమూ కాదు
పరికించితే ఈగోడలవెనుక ఒక జీవితం ఉంది
అది దాని సంపూర్ణమైన అర్థమే
అనంతమైన బాధ
వ్యూహల్లో విహరించే ఆలోచనలు
ఇక్కడి సంస్కృతి-
స్వేచ్ఛ జ్ఞాపకాలతో
బీడిలు తగలబెట్టి పెదాలు —

11. టి.వి.లో జననాట్యమండలి ప్రోగ్రాం చూపిస్తాదేమో అని ఆతృతగా చూశాం. కాని చూపలేదు.

ఉప్పొంగిన జనసందోహాన్ని చూసి
ఉప్పొంగి పోకుండా ఉండలేం
కానయితే
నివురుగప్పిన నిప్పులో జనాన్ని
చూడగల్గిననాడే
పిడికిట్లో ఎర్రజండాని
జనం పైన ఎగిరేయగలం—

12 ఎడారిలో
పూల జ్ఞాపకాలు
ఇసుక దుమారమై
మనసుని కమ్ముతున్నది
పున్నాగ పూల పరిమళాలు యీవేళ
మిన్నాగ పాములై కాటులేస్తున్నై
ఇది విషం కాదు
ఇది నిషా కాదు
ఈ ఎడారి ఇసకై రాలిపోయినప్పుడు
మిన్నాగులే
పున్నాగ పూలై కావలించుకుంటై-

13) ప్రపంచమా!
నాకు కళ్లిచ్చి కాళ్లిచ్చి
చేతలు నేర్పావు
నాకు హృదయమిచ్చి
బాధని నేర్పావు
వాపూపిరిచ్చి
వూహల్ని నేర్పావు
నాప్రాణ మిచ్చి నీ ఋణం తీర్చు కుంటాను-

రాజమండ్రి జైలు నుండి-

చందాలు. రచనలు పంపవలసిన అడ్రస్ :
సృజన ప్లాట్ నెం 11. బ్లాక్ 2 ఎం ఐ జి II
బాగ్‌లింగంపల్లి, హైద్రాబాద్-44

# అప్పుడే ఏమైందని

—సూరజ్

యుద్ధ విరమణ జరుగలేదు
యుద్ధ సంధి జరుగ లేదు
వాడి తుపాకీలో తూటాలు అయిపోయిఅంతె
సంక్షోభం సముద్రంలా పొటెత్తున్న చోట
రెండు యుద్దాల మధ్య కాలమే శాంతి
బూడిదరంగు గుంట కళ్ల కుక్కలు ఇంటిదారి పట్టాయని
కదూ నీవంటున్నది — నిజంకాదు
తల్లి అడవి పసి పాపల్ని బతికించు కున్నది
యుద్ధ విరమణ జరుగలేదు యుద్ధ సంధి జరుగ లేదు
వాడు తుపాకి సరి చూసు కుంటున్నాడు
కాషాయమైనా ఖద్దరు లాల్చీ అయిన కనికరిస్తారని మనం
భ్రమపడద్దు
కల్లోల చట్టంపై కలం పోటు పడ్డదని
కొత్త విచారణ సంఘాలు వెలిశాయని
వెనులు చూపిస్తావేమో
విషనాగులు ప్రస్తుతం పుట్టలో దూరాయి
చుట్టి వేత అణిచివేతను
ఉపసం హరించా డంటావా
దాని పరిధి విస్తరించేందుకు పథకాలు వేస్తున్నాడు
యుద్ధ విరమణ జరుగలేదు యుద్ధసంధే జరుగలేదు
మాయంచేసినా మానభంగాలు చేసినా
మేఘాలను మేఘాలలోకలిపినా
ఆరక మరింత జ్వలించే
జన యుద్ధ అగ్ని పర్వతాన్ని చూసి వాడు
కొంత బెంబేలు పడ్డమాట నిజం అయినా
రాజ్యం పోలీసు హింస కత్తికి పదును పెడుతూనే ఉంది

వాడిప్పుడు కొత్త ఎత్తులు వేస్తున్నాడు
ఆయుధం జాగ్రత్త
అడివన్నలు జాగ్రత్త అడవి జాగ్రత్త
ఖాళీవనాలలో మెసలే జనం బిడ్డెలు జాగ్రత్త
యుద్ధం చేయడం ద్వార మాత్రమే
యుద్ధం ఎలా చేయాలో నేర్చుకున్నాం
నెత్తుటి అప్పులు తీర్చుకుండానే
ఎన్‌కౌంటర్ల పద్దులు చూడకుండానే
ఉత్పత్తి సంబంధాలు మారకుండానే
ప్రజాయుద్ధ సూర్యుడు
ఎర్రకోటపై ప్రభవించకుండానే
యుద్ధ విరమణ ఎలా చేస్తాం
మన యుద్ధ విజయమే విరమణ
శత్రునాశనమే సంధి
అందుకే అన్నీ సరిచూసుకో- గురిచూసుకో
రేపటి యుద్ధానికి సిద్ధం కా

10-2-90

---

# జనం అజేయులు

-కృష్ణాబాబు

అమిపట్టి బెదరగొట్టి అందర్నీ పాలించలేరు
నోరునొక్కి కాలతొక్కి జనాన్ని శాసించలేరు
హింసవల్ల పీడవల్ల హీన హేయ మాయవల్ల
ఖైదువల్ల కత్తివల్ల హత్యా సత్యాలవల్ల
గ్రామాలకి గ్రామాలని గాయం చేయడం వల్ల
గ్రామీణుల మానాలను ఘాతం చేయడం వల్ల
నిరంకుశుల పరిపాలన నేలరాలడం తథ్యం
నరాంతకుల దురాగతం పరాస్తమవడం సత్యం

—శ్రీశ్రీ

గత అయిదేళ్ళ నుంచీ ఓరుగల్లు మీద, మరింత కసిగా, పాలనా యంత్రాంగం తన ఉక్కుపాదం మోపింది. హిరణ్యకశిపుడినీ, హిట్లరునీ తలదన్నారిక్కడి పోలీసులు. ప్రజల కోసం పనిచేసే రాడికల్స్‌ని ఎందర్నో పొట్టన పెట్టుకున్నారు. రకరకాల చిత్రహింసలతో మారణహోమం చేశారు. ఓరుగల్లు జిల్లాలో తమ ఆజ్ఞలేనిదే చీమకూడా చిటుక్కుమనకుండా చేశామని సంబరపడ్డారు. ప్రజల ఆటా పాటా మాటా బంద్ పెట్టామని గొప్పగా చెప్పుకున్నారు. ప్రజల వూపిరిని కూడా రికార్డు చేసుకున్నారు. జనం ప్రాణాలర చేతిలో పెట్టుకుని బతుకుతున్నారు. కాని కార్యకర్తల్ని తమ గుండెల్లో దాచుకుంటున్నారు. అయినా మెరికెల్లాంటి కార్యకర్తలు కొందరు నేలకొరగక తప్పలేదు. అంతటి భయానక పరిస్థితుల్లో, ఉద్యమానికి వూపిరులూదిన కామ్రేడ్ దగ్గురాజలింగు పోరాడుతూ ప్రాణాలొదిలాడు. అతను ప్రాణాలకి తెగించి పోరాడుతున్నప్పుడు పక్కనే అతని భార్య, స్నేహితుడు సంతోష రెడ్డి, అతని భార్యాబిడ్డలు కూడా వున్నారా ఇంట్లో నిజానికది యుద్ధరంగమే వ్యక్తిగత స్నేహంతో, ఉద్యమం పట్ల అభిమానంతో అతనికి ఆశ్రయ మిచ్చిన సంతోష్‌రెడ్డిని కూడా పోలీసుకిరాతకులు ఒదల్లేదు. ఆనాటి పరిస్థితుల్లో అంతటి రిస్క్ తీసుకుని మిత్రుడికి తోడునిల్చిన సంతోష్‌రెడ్డి తెగింపు కూడా

తక్కువది కాదు. మానవ విలువల్ని ప్రజాపుద్యమం, ప్రజాపోరాటమే కాపాడ తాయి. ఈ సంగతి సంతోష్‌రెడ్డి నిరూపించాడు,

అంతటి నిర్బంధకాండ మధ్య ఎన్నో కష్టనష్టాలకోర్చి రాడికల్ పుద్యమాన్ని ముందుకు తీసుకుపోతున్న కా॥ రామకృష్ణ, నాగేశ్వర్రావులను కాల్చేసి హంటర్ రోడ్డు మీద పడేశారు. కా॥ శ్యాంని కూడా అదే విధంగా చేశారు. కా॥ మేఘ్యంని చంపేసి హన్మకొండ చౌరస్తా ట్రాన్స్‌ఫార్మర్‌కి వేలాడదీసి, ప్రజల్ని, ఆ భయానక దృశ్యంతో హడలగొట్టాలని చూశారు పోలీసులు. ఈ కామ్రేడ్సందరూ పాతికేళ్ళలోపు యువకులే. చదువులూ, సరదాలూ అన్నీ వదిలేసి జనంకోసమని, తమ ప్రాణాల్ని లెక్కచేయకుండా విప్లవ కార్యాచరణలో నిమగ్నులయిన వాళ్ళు. అలాంటి వారిమీద చట్టం పరిధిలో చర్య తీసుకోవచ్చు. అరెస్టు చేయొచ్చు. కేసులు కట్టొచ్చు. శిక్షించ వచ్చు. ఇలా చెయ్యడానికి అన్ని సదుపాయాలూ సర్కారు వారికున్నాయి. కాని ఓరుగల్లు పోలీసులు సర్వాధికారులు! చట్టాల కతీతులు! నిజానికి వీళ్ళు కత్తికట్టింది కేవలం విప్లవ కార్యకర్తల మీదే కాదు, ఓరుగల్లు చుట్టూవున్న విప్లవ ప్రజానీకం మీద. ఓరుగల్లు పల్లెల్లోని రైతాంగం నేలతల్లి విముక్తి కోసం పోరాడుతోంది. ఈ విముక్తి పోరాటం ఓరుగల్లు పల్లెలకే పరిమితమై లేదు. పక్కనున్న కరీంనగర్ పల్లెలకి పాకింది. మహారాష్ట్రకి మళ్ళింది. మొత్తం దండకారణ్యాన్ని చుట్టుముట్టింది. ఇవాళ దండకారణ్య గిరిజన రైతాంగం పాలకుల్ని గద్దించి అడుగుతోంది. తన వాణి వినిపిస్తోంది. ఈ వాణికి తమ ప్రాణాలలోని రక్తతైలాన్ని అందించి ఊపిరాడనివ్వని ఉత్తర తెలంగాణా నిర్బంధంలో ఉద్యమానికి ఉపిర్లు పోసిన కామ్రేడ్స్‌కు సంకేతమైన నాయకుడు అమరుడు గోనగాని అయిలయ్య. అందుకే ఇది కామ్రేడ్ అయిలయ్య, రాజలింగునగర్ మరి కామ్రేడ్ అయిలయ్య తల్లి ఈ ఒక్క పేరుణ్ణేకాదు ఇతని తమ్ముడు కుమారస్వామి (రవి)నీ విప్లవానికే త్యాగం చేసింది. ఇప్పటి శక్తివంతమైన ప్రజల చేతి బాంబు ఆ యువకుని రక్తంతో ప్రాణం పోసుకున్నదే' నన్నాడు. ఒక కార్యకర్త.

తెలంగాణా రైతు బిడ్డలు పోరుబాటల వెంట పయనిస్తూంటేకోస్తా జిల్లాల్నించి బంగారుపిచికలు ఎక్కడెక్కడికో వెళ్ళి వాలుతున్నాయి శ్రీకాకుళం, సాలూరు, కరీంనగర్. పాలమూరు, రాయచూరు, బళ్ళారి లాంటి దూర్ప్రాం

తాలకి. ఒక ప్రాంతం నుంచి మరో ప్రాంతానికి తరలి వెళ్ళడం తప్పకాదు. వెళ్ళి ఏం చేస్తున్నారన్నది ప్రశ్న. అక్కడి అమాయకత్వాన్నీ, బీదరికాన్నీ ఆసరా చేసుకుని తమ ఆస్తులు పెంచుకోడానికా, వాళ్ళకి ఆసరా అవడానికా! కన్నవారికీ, వున్న వూరికీ దూరమై దండకారణ్యం దాకా. విశాఖ ఏజన్సీదాకా ఎందుకి యువతీ యువకులు తరలి వెళ్తున్నారు? నూతన వ్యవస్థకోసం ఈ యాత్ర. అయితే ఇదిపూలబాటకాదు ఎంతో ప్రయాసపడాలి. ఎన్నో అవాంతరాలు ఎదుర్కోవాలి. ఒక్కోసారి రోజుల తరబడి నీటిచుక్క కూడా నోచుకో కుండా వుండాల్సి ఒస్తుంది. శత్రువు కంటబడకుండా పొదల మాటున పూపిరి బిగబట్టుకుని ఒంటికాలిమీద గంటల తరబడి నిలబడాల్సి ఒస్తుంది.

అడవుల్లో కొండల్లో ఈకష్టనష్టాలర్చికో కార్యకర్తలు వుద్యమం కొనసాగిస్తారు. పట్టణాల్లో ఉద్యమం ఎదుర్కొనే ఇబ్బందులు వేరే తీరుగా వుంటాయి. అడుగడుగునా ప్రభుత్వ దమనకాండని తట్టుకోవాలి ప్రతిఘటించే పరిస్థితులుండవు. నిరసన ప్రదర్శనలు జరపడానికి వీలుండదు. వాల్ పోస్టర్లొక్కటే శరణ్యం. వాటినంటించ డానికి ఎంతో తెగువ, చాకచక్యం, త్యాగం అవసరం, పోలీసులదృష్టిలో ఇదికూడా నేరమే, రాడికల్ పిల్లల్ని పోలీసు స్టేషన్ ముందు గోచిగుడ్డల్తో మండుటెండలో నడిరోడ్డుమీద దొర్లించేవారు. ఉద్యమం గనిలాంటిది. త్యాగాలు పొతరలాంటివి. ఎంతతవ్వినా ఇంకా బయట పడుతూనే వుంటాయి పేరుపేరు వరసనా ఎందర్ని తల్చుకుంటాం? ఎన్ని వూసులని చెప్పు కుంటాం? ఎన్ని సంఘటనల్ని యాది చేసుకుంటాం? ఉద్యమం కోసం ఆహుతి అయిన యాదగిరిని మాత్రం యాదిచేసుకుందాం. బండి యాదన్న కేవలం ఆర్ ఇ సి లో వంట మనిషి రాడికల్ కార్యకర్తల కార్యాచరణతో ప్రజావుద్యమం వైపుమొగ్గాడు. తానూ వుద్యమంతోనే వుంటానన్నాడు. ఉద్యమం కోసమే బతుకుతానన్నాడు. ఉద్యమానికి ఎంతో చేయూత ఇచ్చాడు. ఇలాంటి మామూలు మనుషులెందరో కళ్ళల్లో వత్తులేసుకుని కాపాడు కోబట్టే వుద్యమం నిలబడింది, ఒరుగల్లు పోలీసులు యాదగిరి కళ్ళల్లో యాసిడ్ పోశారు. యాదన్న ప్రతి అణువు, ప్రతినరం, ప్రతి కణం, ప్రతి శ్వాస విప్లవం కోసమే ఆహుతిచ్చాడు.

ఒరుగల్లు పట్టణం మాట ఇలావుంటే పల్లెలు మరింత ముందు కురికాయి, గొర్రెలు కాసుకుంటూ, కూలిపనులు చేసుకుంటూ, మట్టి పిసుక్కుంటూ,

వంచిన నడుం ఎత్తకుండా కష్టపడే మట్టి మనుషులే దళనాయకులయ్యారు. అలాంటి వీరుల్ని కన్న తల్లిదండ్రులు వేదిక మీదకొచ్చి దుఃఖాన్నాపుకుంటూ తమ తమ బిడ్డల్ని ఎర్రజండాలో చూసుకున్నారు.

ఈరకంగా ఓరుగల్లు పోరుగల్లయింది. ఉద్యమాల పుట్టిల్లయింది. ఊరూరా యువతీ యువకులు ప్రభుత్వ పాశవిక హింసని ఎదుర్కొంటూనే వున్నారు. పోలీసుల రాక్షసకృత్యాలు శృతిమించి రాగాన పడ్డాయి. విప్లవ కారుల్ని పోలీసులు చంపడం అన్ని దేశాల్లో వున్నదే. కాని ఓరుగల్లు పోలీసులు విప్లవకారుల్ని చంపడంలో అనుసరించిన పద్ధతులు అమానుషం. మానవులనేవాలెవ్వరూ వూహించలేరు. వాళ్ళ కర్కశత్వానికి ఎదురొడ్డి నిల్చింది రైతాంగ యువకులే. వీరిలో ఎందరో అమరులయ్యారు. అలాంటి అమరవీరుల నుద్దేశించి.

వీరులార వీరులార రాడికల్ల శూరులార
రాడికల్ల శూరులార రైతుకూలీల బిడ్డలార

అని జననాట్యమండలి (సంజీవి బృందం) విషాదభరితంగా ఆలపిస్తోంది. వేదిక దగ్గరే కూర్చున్న తల్లులూ, తండ్రులూ, భార్యలూ, అన్నదమ్ములూ, అక్కచెల్లెళ్ళూ వెక్కెక్కి ఏడుస్తున్నారు. మిగిలిన వాళ్ళందరికీ కన్నీరు వుబుకుతోంది.

''ఏడవ కండమ్మా, మీ బిడ్డలు ఎంతగొప్ప వాళ్ళోచూడండి. మంది మంచి కోసం వాళ్ళు ప్రాణాలిచ్చారు. తల్లిగా మీరొక్కరేకాదు ఇన్ని లక్షల జనం వాళ్ళని తల్చుకుని జోహార్లంటున్నారు చూడండి'' అని ఓదార్చబోలే ''నిజమే,నా బిడ్డ మంచిగనే పోయిండు. కాని కడుపుతో అవపెట్టినట్టుంటది కదమ్మా'' అన్నదో తల్లి.

అది 1990 మే 5వతేదీ ఓరుగల్లులో రైతుకూలీ ప్రతినిధుల మహాసభలో అమరవీరుల కుటుంబాల పరిచయ కార్యక్రమం జరుగుతోందప్పుడు.

''తమనెత్తురొలికించిన అమరవీరులకి ఏమి ఇవ్వడానికి మాకు శక్తి లేదు. వాళ్ళాశించిన విప్లవం విజయవంతం అయినప్పుడే వాళ్ళ ఆశయం ఫలి

స్తుంది. ఒక కళాకారుడిగా, వీరులగన్న తలిదండ్రులకు లాల్ సలాం పాట వినిపిస్తాను'' అంటూ గద్దర్ గొంతెత్తాడు.

జైబోలో జైబోలో
అమర వీరులకి జైబోలో

పేరు పేరునా జోహార్లర్పిస్తోంటే కన్నీరొలుకుతూనే వుంది. మొత్తం సభాస్థలి అంతాకూడా వుద్రేకంతో, వుద్వేగంతో, కన్నీళ్ళతో మునిగిపోయింది. అయితే త్వరలోనే తేరుకుని.

ఒక చేత్తో కన్నీరు తుడుచుకునీ
వేరొక చేత్తో ఎర్ర జండా ఎత్తుకునీ

అమర వీరులకు జోహార్లు, "అమర వీరుల ఆశయాల్ని కొనసాగిద్దాం అనే నినాదాలతో హోరెత్తిపోయింది. ప్రతినిధుల అవరణ (పాతికెకరాల స్థలం)

జన్ను చిన్నాలు తల్లి స్తూపం దగ్గర జండా ఎత్తినప్పుడూ, వేదికమీద నిలబడ్డప్పుడూ మార్మోగిన నినాదాల హోరులో ఎవరి ప్రసంగాలూ వినబళ్ళేదు. చిన్నాలు నేడు లేడూ చూడు జనంలో వున్నాడు.

79 అక్టోబరు 19న ఈ పొలాల ఒడ్డున రోడ్డుమీద గుండాలు హత్య చేసిన చిన్నాలు, 85 జనవరి 21న ఈ చెరువు కట్టమీద పోలీసులు హత్యచేసిన 18 ఏళ్ళ రాడికల్ యువకుడు సారంగపాణి ఈ శిబిరంలో వలంటీరుగా పని చేస్తూ 90 మే 6 రోజు జ్వరపడి అకస్మాత్తుగా మరణించిన పెరుమాళ్ళ యాద గిరి మన మధ్య మసలుతున్నట్లే వుంది.

ఒకొక్కొక్క అమరవీరుడు వుద్యమంలో చేసిన కృషిని వివరిస్తూ, ఎలాంటి చిత్రహింసలకి లోనయ్యారో, ఎలాపోరాడారో అవన్నీ వైనవైనాలుగా చెప్తుంటే ఆ వీరాధి వీరుల్ని కన్నవారినీ, వాళ్ళ జీవితాల్నీ, రహస్యాల్ని కాపాడి వంచుకున్న భార్యల్ని పరిచయం చేస్తుంటే.

"నా కొడుకు జనం కోసమే పనిచేసి పోయిండు. మరి మీ రందరూ నా కొడుకులే'' అని చెప్పగల్గిన తల్లిని చూసి ఆనందంతో చప్పట్లుచెలరేగాయి. మృతవీరుల కుటుంబాల్లో ఒక తల్లి మరొక తల్లితో 'ఇవ్వాళ మన కొడుకుల

పండుగమ్మా' అని కన్నీళ్ళతో నవ్వింది. వేదిక మీదికి పిలిచి ఏమైనా చెప్ప మన్నపుడు 'ఏం చెప్పనూ - నా కొడుకు చెప్పిన రోజు వచ్చింది' అంటూ ఆనందంలోని విషాద స్మృతిలోకి వెళ్ళిపోయింది.

ఒక ఇల్లాలు "మంచి సేసిండా సెడ్డ సేసిండా అంటే మంచి సేసిండు గనకనే ఇట్ల బతగ్గలుగుతున్నాం" అన్నది. ఆమె కూతురు ఆరేళ్ళది గద్దర్‌ని చూడగానే "మా బాపు ఏడి?" అని అడిగిందట. ఇలాంటి వెన్నో ఎదురు రాబట్టే, ఒక్కొక్క వీరునికి జైబోలో అని పాడేటప్పుడు అంత వివశుడై పోతాడు గద్దర్. వాళ్ళ కుటుంబాలకి ఏం సమాధానం చెప్పనని అందుకే అంత ఆగ్రహంగా ప్రభుత్వాన్ని ప్రశ్నిస్తాడు.

ఒక్కొక్క అమరవీరుని తల్లీ తండ్రీ, లేతవయసు భార్య, పసికూన పిల్లలు - వీళ్ళందర్నీ వదిలి ఉద్యమంలోకి పోయిన రాడికల్స్‌ని తల్చుకుంటే "ఎందరి త్యాగఫలితమో ఇవేళ్టి ఈ వరంగల్ సమావేశం, అని అనిపించింది. అయిదేళ్ళ క్రితం విరసం హాలు మీటింగు కూడా (మొగిలయ్య హాలులో) అతి కష్టం మీద జరుపుకుంది. బైట పోలీసు పటాలం. లోపల మనిషికీ మనిషికీ మధ్య సి ఐడీలు.

ఎన్ని ఆటుపోట్లు తట్టుకుని ఎంత నిబ్బరంతో నిర్మిస్తే ఉద్యమం ఈ దశకి చేరుకుంది? ప్రాణ త్యాగాలేకాక, అనేకరకాల త్యాగాలు, దీక్ష, ప్లానింగ్, నిర్మాణ కౌశలం ముప్పేటగా అల్లుకుంటేగాని సాధ్యం గాని ఉద్యమం ఇది. దాని పట్ల ప్రేమ, ఆశ, నమ్మకం ముప్పిరి గొనబట్టే జనం ఇలా తరలి వచ్చారు.

ఇరవై ఏళ్ళు దాటని యువతులెందరో తమ భర్తల్ని కోల్పోయారు. "అర్ధమర్రేతి ఇంటోంచి తీసుకుపోయిండ్రు పోలీసోల్లు. అన్ని చేసన్లకు నా అన్నలు పోయి ఎతికచ్చిండ్రు. 'పంపేస్తాం ఒత్తడు పొండ్రి' అన్నా రేగాని ఇంతవరకి రాలా. అసలింతకీ అతనున్నట్టా లేనట్టా? ఉంటే ఉన్నదని సెప్పండ్రి. లేకుంటే సంపేసినం అని సెప్పండ్రి. నా పిల్లల కేం సెప్పను?" అని పోలీసుల్ని ఉద్దేశించి తీవ్రంగా ప్రశ్నించిందో యువతి.

"ఎర్ర జెండ ఎర్రజెండ అనుకుంట నా కొడుకు దాంతోనే బతికిండు. ఎంత మంది తమ పార్టీలో సేరమని లొల్లి పెట్టినా సేరలే. అందరి కోసం

బతికిన నా బిడ్డని సంపేసి రైలుకింద పెట్టిండు. నా కొడుకు కోరుకున్న ఎర్రజెండలే ఇగో గివ్వన్నీ'' అంటూ కన్నీరు తుడుచుకుంది ఓ తల్లి,

ఇంకోతల్లి - ఆమె కొడుకుని పోలీసులు ఇంట్లోంచి తీసుకుపోయి లాకప్‌లో పెట్టారు. తల్లి పోలీస్‌స్టేషన్‌కి పరుగెత్తింది. ''ఇదిగో విడిచి పెడ్తున్నా''మంటూ పొద్దు గుంకేదాకా గడిపారు. మునిమాపు చీకట్లలో జీపు తీసుకొచ్చి ద్వారం దగ్గర నిలబెట్టారు. తల్లి అనుమానించినట్టే జీపు చర్రున దూసుకుపోయింది. బిడ్డా బిడ్డా అంటూ వెంటబడింది. ఆమె తిరగని పోలీసు స్టేషన్ లేదు. ప్రతి చోటా లేడు పొమ్మని ఛీ కొటారు. కాని ఆమెకి తెల్సు పలానా స్టేషన్లోనే వున్నాడని చూసుకోలేకపోయినా తనచేతి భోజనం అతనికి పంపగల్గింది. అంతే కాదు ''చావసన్నా చావు, కాని లొంగిపోయి బైటికి రాకు'' అని కబురంపగల్గిన వీరవనిత ఆమె. ఉన్నట్టుండి కొడుకుని మాయం జేశారు. ఉద్యమానికి అంకితమైన వాళ్ళందరికీ ఇప్పుడామె తల్లే. వేదిక మీద నుంచి దిగుతున్నప్పుడు ఆమెకి వాలంటీరు చెయ్యిసాయం ఇవ్వబోతే వారించి, పిడికిలి బిగించి జనానికి రెడ్ శాల్యూట్ చేసింది.

డా॥ రామనాధంగారూ ఎప్పుడూ ''వరంగల్లులో మన సభలకీ సమా వేశాలకీ మందిరం ఒకటుండాలి. పర్మిషన్ల బెడద లేకుండా అందరికీ అందు బాటులో వుండాలి'' అనే వారు, ఆయన భార్య, లక్ష్మివాగ్దానాన్ని కొడుకు శ్రీనివాస్ ఆయన ఆకాంక్షని నెరవేర్చేందుకు మీటింగుహాల్‌కోసం స్థలం ఇస్తా మని ప్రకటించాడు. మళ్ళీ ఇన్నాళ్ళకు ఇంతమంది మధ్యలో వుండడం ఆనం దంగా వుందన్నాడు.

ఈ అయిదేళ్ళుగా శత్రువు ఎందరో రైతుకూలీ బిడ్డల్ని పొట్టన పెట్టు కున్నాడు. కాని విప్లవ శిబిరంలో తామూ వున్నామని చెప్పుకునే కొందరు ఈ రైతు కూలీల మీదా, వాళ్ళ బిడ్డల మీదా ఎంత దుష్ప్రచారం చేశారో మనకి తెల్సు. వ్యక్తిగత హింసావాదులనీ, ఆర్థిక పోరాటాలకి పరిమితమయారనీ, వీళ్ళకి సిద్ధాంత పటుత్వం లేదనీ పండితుల్లాగా శాపనార్థాలు పెట్టారు. జన చైతన్యం ముందు ఇవన్నీ దూది పింజల్లా ఎగిరిపోయాయి.

అమరవీరుల కుటుంబాల్ని చూసినప్పుడు ఈ ఉద్యమంలోని వర్గ స్వభావం బోధపడుతుంది. మధ్య తరగతి తల్లిదండ్రులు డాక్టరో, ఇంజనీరో

కావల్సిన తమ బిడ్డ తమకు దక్కకుండా పోవడానికి సావాసగాళ్ళు కారణమనీ వాళ్ళందరూ బాగానేవున్నారనీ, తమ కొడుకునే బలిచేశారనీ వాపోతూంటారు. కాని ఈ కూలినాలి అమ్మలు, అయ్యలు ఒక్కళ్ళైనా ఇలాంటి భావం ప్రదర్శించలేదు, ఇది సుద్ద గోసిగాళ్ళ పోరాటమని మన 'మేధావుల' కన్నా మన మధ్య తరగతి వాళ్ళకన్నా వాళ్ళే బాగా గ్రహించారు. అందుకే అట్టడుగు ప్రజల యీ వుద్యమం విముక్తి సాధించి తీరుతుందని ఈ సభలకి వచ్చిన వాళ్ళందరికి బోధపడింది.

పై తరగతి వాళ్ళల్లో మానవ సంబంధాలు ఎంతగా విషపూరితమై పోయాయో మనం రోజు చూస్తూనేవున్నాం. స్వార్థం, ఆస్థి - వీటి ముందు మానవతా విలువలు ఇగిరిపోయాయి. ఎగిరి పోయాయి. చెమటోడ్చే మనుషులు లక్షల మంది అలా ఓచోట గుమిగూడడం సరికొత్త అనుభవం - మానవతా సూర్యోదయమై సాక్షాత్కరింపచేసింది. ఉద్యమాలు, పోరాటాలు, స్వార్థత్యాగాలు, బలిదానాలు - ఇవి పేద ప్రజల సహజ గుణాలు. అన్ని లక్షల మంది అక్కడ గుమి గూడినా శాంతి భద్రతల సమస్య ఉత్పన్నం కాలేదు. ఏ అవాంఛనీయ సంఘటన జరగలేదు. సర్కారు వూసులేదు. పోలీసుల ప్రమేయంలేదు. సంపన్నుల జాడలేదు. నిజమైన ప్రజారాజ్యమొస్తేనే మానవ సంబంధాలు మెరుగవుతాయి, మానవతా విలువలు వికసిస్తాయి.

## భూమిక

(4వ పేజీ తరువాయి)

ఆత్మవిశ్వాసం, గౌరవం, అధికారం దిశమారుతున్న సూచనలు స్పష్టమైన సంకేతం. ఇది అణచివేత తేల్చగలిగే ఓటమి గెలుపులు కాదు.

అందుకే ఇప్పుడెవ్వరూ రైతాంగం భూమి స్వాధీనం చేసుకోవడం తప్పని మాట్లాడడం లేదు. ఆ క్రమంలో తప్పులు జరుగుతున్నాయని సన్నాయి నొక్కులునొక్కడానికి ప్రయత్నిస్తున్నారు. ఉప్పెనలావచ్చిన ఈ ఉద్యమంలో అనుభవం లేకనో, ఆవేశం వల్లనో తప్పులు జరిగితే దిద్దుకుంటాం అని పూనుకుంటే ఇవ్వడానికి మీరెవ్వరు? తీసుకోవడానికి వాళ్ళెవరు? అని శ్రీకృష్ణ పరమాత్మ వలె పోలీసులు ప్రవేశిస్తున్నారు. ప్రభుత్వం లేకుండా ప్రజలు బ్రత

గ్గలరంటే ఇక ప్రభుత్వాల బ్రతుకుదెరువేది? గ్రామంలో పెత్తందార్ల ప్రమేయం లేకుండా ప్రజలు పంచాయతీలు నిర్వహిస్తు పోలీస్ స్టేషన్‌కు కేసులుపోకుంటే అసలు పోలీసులే వ్యక్తులుగా తమకు జరిగిన అన్యాయాలను ప్రజాపంచాయితీలకు నివేదించుకుంటే ఇక పోలీసు యంత్రాంగం ఏమైపోను? పోలీసు వ్యవస్థ ఏమైపోను? కోర్టులలో న్యాయవాదులు జడ్జిలను నిలదీసి మీరి కేసులను తొందరగా తేలుస్తారా? ఆ అన్నలదగ్గరికే న్యాయంకోసం పొమ్మంటారా? అని అడుగుతుంటే ఇక కోర్టులేమైపోను? నేరమే లేకపోతే నాగరికత పూతపూసిన దోపిడీ వ్యవస్థ ఏమైపోను? అందుకనే దుర్మార్గానికి పూనుకో. దుష్ప్రచారానికి పూనుకో.

కోట్ల రూపాయల ఫండ్స్ వసూలు చేస్తున్నారు. ఇవ్వకుంటే చంపుతామంటున్నారు. ఆయుధాలుకొనుక్కోడానికి డబ్బు, అని బహిరంగంగానే చెబుతున్నారు. పట్టపగలే గ్రామాల్లో అయుధాలు పట్టుకొని తిరుగుతున్నారు అని ఆరోపిస్తున్నారు. ఎవరు? ప్రతీఎన్నికలకు కోట్లరూపాయల నిధులు వసూలుచేసే పార్లమెంటరీ పార్టీలు, క్రికెట్ తారల షో మ్యాచ్‌లనుంచి, సినిమా తారల షోల దాకా ప్రభుత్వ యంత్రాంగాన్నంతా బలవంతంగా టికట్లమ్మే కార్యక్రమంలో నియోగించేవారు, నల్లడబ్బు వసూలు చేసి ఎన్నికల్లో డబ్బు ఖర్చుపెట్టే వాళ్ళు. సామ్రాజ్యవాద యుద్ధోన్మాద ఆయుధాగారాలు తళతళలాడడానికి యుద్ధాల్లో దిగి పోటీపడి ఆయుధాలు కొంటున్నవాళ్ళు, అందులోనూ కక్కుర్తిపడి కమీషన్లు కొడుతూ దేశాన్ని తాకట్టుపెడుతున్నవాళ్ళు. అంతర్జాతీయ ఆయుధ దళారీల పావులుగా ప్రభుత్వాన్ని నడుపుతున్న వాళ్ళు కూల్చడానికి కుట్రలు చేస్తున్న వాళ్ళ స్వయంగా వీళ్ళంతా సాయుధులే. ఒక్క అయుధానికి లైసెన్సు తీసుకుని అపాదమస్తకం లైసెన్సులేని ఆయుధాలతో అంగరక్షణ చేసుకుంటున్న వాళ్ళు. జీపులనిండా, జోలెలనిండా బందూకులు బాంబులు వేసుకొని విసురుకుంటున్న వాళ్ళు. దురాక్రమణలో ఉన్న భూములు నిలుపుకొనడానికి శాసనసభలు, చట్టాలు శాస్త్రిలు చాలనపుడు ఆయుధాలనే నమ్ముకున్న వాళ్ళు. ప్రజలు తమ భూముల్ని తామే స్వాదీనం చేసుకోవాలంటే జెండా కర్రలే చాలవు, ప్రజాచైతన్యం పట్టించిన అయుధాలు పట్టాలని చెప్పినపుడు ఆకాశం ఊడి పడ్డంత ఆర్భాటం చేస్తున్నారు.

వాక్, సభా స్వాతంత్ర్యాలు పాటలు - మాటలు పాడే ఆడే పర్మిషన్లు అన్నీ అందులోని భావాలు భౌతిక శక్తిగా మారే క్రమంలో రద్దవుతాయని

మేనెల నుంచి మళ్ళీ మొదలయిన భూపోరాటాలు రుజువుచేస్తాయి. తెలంగాణా, నక్సల్బరి, శ్రీకాకుళం, జగిత్యాల గెలుపు ఓటమి, అంతిమంగా గెలుపు. అనే ఈ అవిశ్రాంత సుదీర్ఘ పోరాట తత్వాన్ని ఇవ్వాళమన అనుభవానికి తెస్తున్నది. వనిముట్లు, విత్తనాలు, ఎరువులు, పశువులు నీటివసతి లేనివానికి భూదానం ఎట్లా ముక్తి నిస్తవో భూసంస్కరణలు ఎట్లా భూమి మీద హక్కు నివ్వవో, విముక్తి లక్ష్యంగా లేని భూపోరాటం ముక్తి నివ్వజాలదు. అందుకే వ్యక్తులుగా పట్టువిడుపులు చూపుతున్నట్టు సామరస్యంగా సమస్యలు పరిష్కరించుకోడానికి ప్రయత్నిస్తున్నట్లు అనిపిస్తున్నా వర్గాలుగా దీర్ఘకాల సంఘర్షణకు శక్తులు సూరుతున్నారు.

దీర్ఘకాల వర్గ ప్రయోజనాన్ని కాపాడే పని నెత్తికెత్తుకున్న పోలీసు వ్యవస్థ వందల వేల సంఖ్యలో అరెస్టులు, అక్రమ లాకప్పులు, సోదాలు, గ్రామాలను ముట్టడించి దాడులు "ఎన్‌కౌంటర్" హత్యలు- తిరిగి ప్రారంభించింది.

శత్రువు కూడా ఒప్పుకోక తప్పని ప్రజాబలం పునాదిగా ఉన్న పోరాటంగా ఈ ఉద్యమం రుజువైంది గనుక శత్రువు ఇపుడు ప్రజల మీద దాడి చేస్తాడు. గ్రామాలమీద, మిలిటెంట్లమీద ప్రజాసంఘాలమీద దాడిచేస్తాడు. మదనపల్లి "ఎన్‌కౌంటర్"తో రైతు కూలీ సంఘం సభల అనుమతి నిరాకరించి ప్రజాసంఘం కార్యకర్తలను హత్యచేయడంద్వారా మనకు చేసిన హెచ్చరిక అదే. చేపలకు ఊపిరాడకుండా చేయాలంటే నీళ్ళని తోడెయ్యాలి. జనం జీవనదులయితే అది సాధ్యమయ్యే పనికాదు. ప్రవాహ సదృశ్యంగా మన ముందు సాగుతున్న ఉద్యమం ఆ సత్యాన్నే చాటి చెప్పుతున్నది.

విప్లవరచయితలు, కళాకారులు, మేధావులు ఈ భూస్వామ్య సంక్షోభాన్ని భూమి సంచలనాన్ని ఎట్లా రికార్డుచేస్తారో తమ ఆలోచనల్లో రచనల్లో, కళాప్రక్రియల్లో ఎట్లా ప్రతిఫలింప చేస్తారోనని ఆకాంక్షతో ఉత్కంఠతో వర్తమాన చరిత్ర రెప్ప ఆర్పకుండా చూస్తున్నది ఆ కళ్ళలోని ఆకల్ని, కలల్ని, అనుభవాన్ని, అనుభూతిని ఆవిష్కరించే పరిణత తరుణం విప్లవ రచయితల సంఘానికి, విప్లవ సాంస్కృతిక ఉద్యమానికి వచ్చింది,

మన "ఉప్పెన"లూ, "విముక్తి" ఉద్యమాలే, మనం జాలరులమై ఈ భూపోరాట కెరటాలని ఈదితే మనం ఎన్నెన్ని సాహిత్యముత్యాలు దోసిల్లకెత్తగలమో! మనసున్న చోట మట్టిలో మాణిక్యాలున్నాయి. చూపుమున్న చోట కదులుతున్న మట్టిలో కదులుతున్న సజీవపాత్రలూ ఘటనలు రూపుగడుతున్న నూతన సృష్టి ఉన్నది.

జూన్ 28, 1990, —సంపాదకుడు

సంస్మరణ :

# కామ్రేడ్ నూకరాజు

.... గౌతమి

పోరాటం మధ్యనున్న వీరుడు లేదా యుద్ధం మధ్య నుండి రచయితలు నేడు విరివిగా విప్లవ సాహిత్యం సృష్టిస్తున్నారు. ఒకప్పుడు పోరాటం తదుపరే పోరాటంపై సాహిత్యం వచ్చినా ఈనాటి దీర్ఘ కాల పోరాటంలో సమకాలీన ఉద్యమంపై ఉద్యమంలో పాలుపంచుకుంటున్న కామ్రేడ్స్ స్వయంగా కలం చేబూని ఆయా ప్రాంతాల ప్రజల స్థితిగతులు మొదలు పోరాటంలోని ప్రతి మలుపును పాఠకులముందు నిలుపుటకు అనేక ప్రక్రియలు చేపడుతున్నారు. గత కొద్ది సంవత్సరాలుగా ఈలాంటి రచయితల సంఖ్యనే ఎక్కువని చెప్ప వచ్చు. రాశిరీత్యానే కాకుండా వాసిరీత్యా పరిగణలోకి తీసుకోబడాల్సిన రచనలు కూడా అనేకం అని చెప్పడం అతిశయోక్తి కాదనుకుంటా.

కాగా ఉద్యమ ప్రారంభ రోజుల్లో గ్రామీణ జీవితం గురించి రాసిన చాలా మంది రచయితలు నేడు అంతగా రచనలు చేయడం లేదు. ఉద్యమ కారులతో సజీవ సంబంధాలుండి, ఉద్యమ ప్రేరణగా జీవిస్తున్న ఒక సెక్షన్ రచయితలే తామే వృత్తిలో వున్నా ఆయా సందర్భాలల్లో విలువైన రచనలు చేశారు చేస్తున్నారు.

పోరాటంలో నున్న కామ్రేడ్స్ తమ కలానికి గళానికి పదును చేకూర్చు కునే క్రమంలోనే నేలకొరుగుతూ తమతో పాటుగా నిలిచిన సహచరులకు తమ వారసత్వం అందిస్తూ అమరత్వం పొందిన రచయితలు గాయకులు దండకా రణ్యం ఉత్తర తెలంగాణా పోరాటాల్లో మణిపూసలా కానవస్తారు. ఆ బాట లోనే నడిచివచ్చి నడుస్తున్న క్రమంలోనే నేల కొరిగినవాడు కా॥ శెట్టి ప్రసాద్.

వరంగల్ జిల్లాలోని జనగామ తాలూకా ఎల్లారెడ్డిగూడెం గ్రామంలో జన్మించిన ప్రసాద్ ఇంటర్ చదువు మధ్యలోనే నిలిపివేసి హైదరాబాద్ నగ రంలో **RSU** నిర్మాణంలో భాగమైనాడు. తదుపరి క్రమంలో తూర్పు కనుమ

ల్లోని గిరిజన గూడాలల్లో ఉద్యమ నిర్మాణంలో భాగమైపోయాడు. సాధారణ దళ సభ్యుడిగా జీవితం ప్రారంభించి కమాండర్‌గా ఎదిగిన సూకరాజు (ప్రసాద్) 3, 4 మాసాల క్రితం తూర్పు డివిజన్‌లోని గుంటకాని పాలెంలో జరిగిన పోలీసు కాల్పుల్లో అమరుడైనాడు.

కా|| ప్రసాద్ రోజు గ్రామల్లో తన గళం విప్పి పాట అందుకుంటే భగతులు, కోందులు, వాల్మీకులు ఒకరేమిటి అఖాలగోపాలం అతనితో గొంతుకలిపి కోరస్ పలికేవారు. గొంతులో నుండి పాట జాలువారుతుంటే, కాలుతో దరువువేస్తూ లయబద్ధంగా ఊగి ఆట ఆడే నాగులకొండ దళ కమాండర్ అయిన ప్రసాద్ ఆ ప్రాంతపు గిరిజనుల గుండెల్లో చెరగని ముద్ర వేసుకున్నాడు. గొంతెత్తి పాడి ఆడటమే కాదు, కలం కదిపి పాటలు రాయడం కూడా ప్రారంభించాడు. అలా రాయబడినవన్ని ఈనాడు విశాఖ-తూర్పు గోదావరి జిల్లాల్లో విస్తృతంగా పాడబడుచున్నాయి- అందులో నుండి ఒక పాటను దిగువన అందిస్తున్నాను.

ప్రసాద్‌లాంటి అజ్ఞాత కళాకారులందరు విప్లవ ప్రజానీకానికి ఆయా ప్రాంతాల్లో చిర పరిచితులే అయినా విప్లవ పాఠకులకు అపరిచితులే. ఈ అపరిచితులందరి ముద్ర చెరిగిపోకుండా చరిత్ర కోసం రికార్డు చేద్దాం.

(పాట సేకరణ ఒక కార్యకర్త నుండి)

## గిరివాసి

కొండల్లో గిరిజనుడ కోనల్లో గిరిజనుడ
రామరాజు బాటనడువురో ఓ గిరిజనుడ
ఇంటి బద్ద చేతబట్టరో

1. నీ పేరు కొండోడు కొండనీది కాదన్న
పెద్దల ధీమతోటి మేకలు కొండకు కొడై
ఉచ్చుటోసి ఊడ్చిసట్టు గార్డుగాడు పుల్లరడిగె
కొత్త కాపురంకు నీవు గున్నమామిడి గుడికెత్తె
కొడిపెట్ట బియ్యమడిగి బాధపెట్టె వో అన్న

లంచమడిగి బాధ పెట్టెనా వో అన్న
లేనిపోని కేసుపెట్టెనా వో అన్న

2. కండలన్నీ కరిగిపోంగ ఒల్లంత మండిపోంగ
వగలు కోతులు కాసి రాత్రులు పందులు గాసి
కొండ పోడుచేసి తిండి లేక జీవి స్తవ్
తేగ దుంపలె నీకుఅన్న మో ఓ అన్న
బలుసాకులు నీకు కూరలో ఓ అన్న

3. నల్లమోకలొద్దినంత సుబ్బరంగ సాపుచేసి
చెమట జల్లి రక్త మోడ్సి సదునుచేసి ఫలపరిసి
వరి ధాన్యం అవరాలు దండిగ నువ్ పండించిన
కలువుల చిండి-నీదిరో ఓ అన్న
మరుగు పులుసు నీయిరో ఓ అన్న

4. చివరి చివరి కొమ్మలెక్కి చింతబుట్ట లేరుకో స్తవ్
అడివంత కలెదిరిగి అడ్డాకులు తెస్తావు
చెట్టు చెట్టు తిరిగి జిగురు తీసుకొస్తావు
లాగలన్ని నెలికి నెలికి తేనె తీసుకొస్తావు
హడవుడిగ ఎన్ని తెచ్చినా ఓ అన్న
సంత కర్చుకు దారే లేదురో ఓ అన్న

5. సామారపు బతుకులని భీమారం కోతకెల్తె
సంపాదించింది లేదు సరిపోయె ఖర్చులకే
బతుకు దెరువుకని చెప్పి భద్రాచలం నర్కకెల్తె
డబ్బు తెచ్చుడెమోగాని జబ్బుపాలై పోతివి
ఊరిడిసి ఏడి కెళ్ళినా ఓ అన్న
కుక్క బతుకులై పోయెరో ఓ అన్న

6. నీ కొడుకు పెండ్లికేమొ ఉన్నగరువు తనకపెడ్తివి
నీ భార్యకు జబ్బు చేస్తె చెట్టుతోట నమ్మినావు
కరువు కాలంలోన కాట-ధాన్యం అప్పు తెస్తివి
కాటకు కాట లెక్క దాటిపోయె పది కాటలు
నీ తెనక విడిపోయే దెన్నడో ఓ అన్న
నీ అప్పులు తీరే దెన్నడో ఓ అన్న

7. మాటలు రాని నీ కూతురు మేకలెంట పోయినాది
గోచి పెట్టని నీ కొడుకు గొడ్లెంట పోయినాడు
మీసం రాని నీ కొడుకు అర్కబట్టి దున్నుతుంటే
అరె సదువు ఏది ! సంధ్య లేవిరో ఓ అన్న
ఆట లేవి పాటలేవిరో ఓ అన్న

8. జ్వరమొచ్చి నీ కూతురు నోట్లో నీళ్ళు పొయ్యలేదు
గొడ్లగాసె మీ సంటడి కందతెగె కత్తితోటి
పిప్ప పన్నుతో బుడ్డడు బుగ్గవాసి బాధ పడె
గంటి నొప్పితో భార్య మూల్గుతుంది రేయివగలు
మందు ఏది మాత్ర ఏదిరో ఓ అన్న
అసుపత్రి ధర్మ మేదిరో ఓ అన్న

9. నూకలమ్మకు నీవు మొక్కినావు కోడిపుంజు
రాజులు బాబుకు నువ్వు కోసినావు మేకపోతు
సింహాచలం, భద్రాచలం ఎన్నో సార్లు పోయినావు
పండగ లెన్నో చేసినా ఓ అన్న
నీ బాదలేమి తరగలేదురో ఓ అన్న

10.- గిరిజన సదుపాయాలని గొల్లుమనే రేడియోలు
గిరిజన సంస్కరణ లంటూ సూపుతారు సినీమాల్లో
నీ కిచ్చిన చీడి పిక్క చెదతినె నేలలోన
నీ కిచ్చిన దూడలేమొ సచ్చిపోయె గడ్డిలేక
నీ కట్టినా కోలని కల్సిపోయె మట్టిలోన
కంటి తుడుపు సదుపాయాలో ఓ అన్న
మన బతుకులు మార్చలేవురో ఓ అన్న

11. దూడలిస్తరనుకొని ఆవుదూడ కోటేస్తి
అవు లేదు దూడ లేదు దూరమాయే మన బతుకు
నాగలి పట్టిన రైతుకు నమ్మకంతో ఓటెస్తె
రైతుల బతుకుదోసే రాబందులు రాజ్యమెక్క
కమ్మని మాటలు చెప్పే కాంగిరేసు కోటెస్తె

అరచేతిన తేనెపోసి మోచేతిని నాకించిరి.
కష్టాలు పోతయని కమ్యూనిస్టు కోటేస్తే
కాంట్రాక్టర్లయి కొడుకులు తిరుగుతుంద్రు జీపులల్లో
తెలుగు రాముడుకు నీవు తెలివిటోడని ఓటెస్తె
పోలీసు క్యాంపులు పెట్టి పొట్టుపొట్టు కొట్టించే
మంత్రులెందరు మారినా ఓ అన్న
నీ గోసి నెవడు మార్చలేడురో ఓ అన్న

12. ఎన్నాళ్లు ఈ బతుకులు ఎన్నేళ్లు ఈ బాధలు
అడవి దుండె బతుకుదుంపలు తినేబతుకు
ఈ బతుకులు మారాలని మన బాధలు తీరాలని
రామరాజు బాటల్లో రాడికలన్నలు బయలుదేరె
అడివన్నల అడుగులల్లోరో ఓ అన్న
అలుగులెత్తి నడవాలిరో ఓ అన్న

13. అలనాడు మన పెద్దలు తెల్లోడి బాధపోను
గంటందోర మల్లుదొర వీరన్న పడాల్ అగ్గిరాజు
రామరాజు అడుగుల్లో అలుగు త్తినారంట
మిరపకాయ టపాపంపి సేషన్లనే కొట్టిరంట
మాటుగాసి మట్టు పెట్టుటే ఓ అన్న
పరుగుదీసే గూర్ఖా దండురో ఓ అన్న

14. వెన్నలాంటి నీ గుండె రాయిగ చెయ్యాలిరన్న
అరటాకు నీ మనసు అగ్గొలె మండాలిరన్న
అదిగదిగో అటుసూడు గొండన్నల తుడుం మోత
అదిగదిగో అటుసూడు లంబాడోల్ల లడాయి
ఇదిగిదిగో ఇటుసూడు కోందు దాదాల పోరాటం
వాల్లందరికి తోడు బైల్ ఢుక్కా మోగించు
చిరుతల కోపులు కాదురో ఓ అన్న
కత్తుల కోపులు వెయ్యరో ఓ అన్న

॥ కొండల్లో గిరిజ ॥

# విచ్ఛిన్నమవుతున్న వ్యక్తిత్వం

మాక్సిం గోర్కీ

(గత సంచిక తరువాయి)

ఏ సంస్కృతి అయితే కొత్త హూణుల చేతుల్లో ధ్వంసమైపోనున్నదని క్షుద్రులు అంతకంతకు బిగ్గరగా, ఎక్కువగా హాహాకారాలు చేస్తున్నారో ఆ సంస్కృతి ఎక్కడుంది? మానవమేధ సాగించిన విశ్వవ్యాప్త కృషి, అది గతం నుంచి పొందిన వారసత్వాల ప్రతిబింబమేనా బూర్జువా "నాయకుడి" హృదయంలో ఉన్నది?

తరతరాల వారసత్వం తన మానసిక పరిధులకు అవతలనే రక్షించబడిందని క్షుద్రబూర్జువా ఇక గుర్తించక తప్పదు. ఆ వారసత్వం పురావస్తుశాలల్లో, గ్రంథాలయాల్లో ఉన్నది గాని, క్షుద్రుడి మనసులో లేదు. గతంలో జీవన సృష్టికర్త పాత్ర నిర్వహించిన ఈ సంస్కారహీనుడు ఇప్పుడు కాలం చెల్లిన సత్యాల మరుభూమికి కదలలేని కాపలాదారు అయిపోయాడు. కాలం చెల్లిన దాన్ని పునరుజ్జీవింప జేసేందుకు గాని, కొత్తదాన్ని సృష్టించేందుకు గాని అతనికి శక్తిలేదు.

ఇవాళ్టి మనిషి ఒంటరిగా ఉన్నాడు, విడిపోయే వైపు అడుగులువేస్తూ ఉన్నాడు. (డాస్టవిస్కీ క్రైమ్ అండ్ పనిష్‌మెంట్‌లోని) మార్మెలాదొవ్ కన్న దురదృష్టకరమైన జీవిలా ఉన్నాడు। ఎందుకంటే నిజంగానే అతను ఎక్కడికీ వెళ్ళలేడు. ఎవరూ అతణ్ణి కోరుకోరు. తన అశక్తత తెలిసి అతను గందరగోళ పడుతాడు. పతనం తప్పదని తెలిసి భయ విహ్వలుడవుతాడు. జీవితంలో అతని విలువేమిటి? అతని సౌందర్యం ఎక్కడ ఉంది? శిథిలమైన నాడీ మండలంతో, నిర్వీర్యమైన మేధతో, మానసిక వ్యాధుల నిలయమై సగం చనిపోయిన అతని దేహంలో మానవీయమైనదేమిటి? వ్యాధి తప్ప మరేదీలేదు.

మన కాలంలోని ఎక్కువ సున్నితమైన హృదయాలూ, ఎక్కువ నిశితమైన మేధలూ ఈ ప్రమాదాన్ని గుర్తించడం ప్రారంభించాయి. మనిషి శక్తి ఎట్లా విచ్ఛిన్నమైపోతున్నదో చూసి "నేను" లోకి కొత్త జీవాన్ని తాజాతనాన్ని నింపవలసిన అవసరం గుర్తించి వీళ్ళు ముక్తకంఠంతో ప్రకటిస్తారు. మనిషి ఉడిగిపోతున్న తన శక్తులను పునరుద్ధరించుకోగలిగే, బలోపేతం చేసుకోగలిగే సజీవ శక్తి ఊటకు మార్గాన్ని వీళ్ళు చూపుతారు.

ఈ విధంగానే, వాల్ట్ విట్మన్, హొరేస్ ట్రాబెల్, రిచర్డ్ డెహ్మెల్, వెర్హేరెన్, ఎచ్.జివెల్స్, అనటోల్ ఫ్రాన్స్, మారిస్ మాటర్లింక్ వీళ్ళందరూ వ్యక్తివాదం నుంచి, నిష్క్రియావాదం నుంచి సోషలిజం వైపు, క్రియాశీలతను ప్రబోధించే వైపు మళ్ళారు. మనిషి మానవజాతితో సమ్మిళితం కమ్మని మరింత బిగ్గరగా వాళ్ళు పిలుస్తున్నారు. చివరికి, ''నేను''ను ఆరాధించే అగస్టుస్ట్రిండ్ బర్గ్ కూడ మానవజాతికి గల సంపూర్ణ ప్రభావం గురించి మాట్లాడక తప్పలేదు. ''మానవజాతి అనేది అసంఖ్యాక కణాలతో తయారయిన బ్రహ్మాండమైన శక్తి వనరు. దానిలోంచి ఒక కణాన్ని విడదీస్తే వెంటనే అంతరించిపోతుంది'' అన్నాడు స్ట్రిండ్ బర్గ్.

అయితే మేధావుల నుంచి వెలువడిన ఇటువంటి మంచి సలహాలు కూడ చెవిటివాడి చెవికెక్కవు. ఒక వేళ విన్నా ప్రయోజనమేమిటి? జీవితం ఆనందమయంగా పిలిచేటప్పుడు, ఇక ఆశలేకుండా వ్యాధిపీడితుడైన మనిషి ఎట్లా ప్రతి స్పందిస్తాడు? కేవలం ఒక మూలుగుతో మాత్రమే...

మనసు రీత్యానూ, శరీరం రీత్యానూ కూడా మేధావికి ఏ వర్గంతోనైనా కలవగలిగిన లక్షణాలున్నాయి. కాని దేశంలో (రష్యా-అను) పరిశ్రమాభివృద్ధి వర్గాలు సంఘటితమైన తీరూ మేధావుల శ్రేణుల్లో పెరుగుదల కన్న మంద కొడిగా సాగినందువల్ల ఈ మేధావి సాంఘికంగా గణనీయమైన ఏ బృందం తోనూ కలవక విడిగా తన మార్గం ఎంచుకునే వైపు నెట్టబడ్డాడు. అర్థకాని సత్యం రద్దయినందువల్ల చితికిపోయి ''పశ్చాత్తాప పడిన ప్రభువర్గీయుడి'' లాగ, మేధావి కూడా ఇతరదేశాల్లో తన తోటివాళ్ళు ఎదుర్కొనని సమస్యలు ఎదుర్కొవలసి వస్తోంది. ఆ సమస్యలన్నిటినీ రెండు ప్రశ్నల్లో చెప్పవచ్చును

''నేను ఎంచుకోవలసిన మార్గం ఏది?''

''ఏం చేయవలసి ఉంది?''

ఇప్పుడిక అవసరమైనదేమంటే, దిగువ మధ్య తరగతి అవసరాలను తీర్చేందుకుగాను భావజాల రంగంలో ఒక ప్రధానకార్యాలయం లాంటి దాన్ని స్థాపించాలి. ఈ అవసరాన్ని తీర్చేందుకే ''చరిత్రలో వ్యక్తి పాత్ర'' అనే సిద్ధాంతం పుట్టుకొచ్చింది. ఈ సిద్ధాంతం సాంఘిక లక్ష్యాలను వ్యక్తులు మాత్రమే సాధించగలరని నొక్కి వక్కాణించింది.

అనుసరించవలసిన మార్గం స్పష్టమే : మేధావి ప్రజా బాహుళ్యం మధ్య పనిచేసి, వాటిలో వారి హక్కుల గురించి స్పృహను రేకెత్తించాలి. ఈ మేధావి వర్గం ప్రజాశక్తిని తమ శక్తివనరుగా గుర్తించిన తర్వాత, కొత్త

సంస్కరణలు ప్రవేశ పెట్టమనీ దేశపు సాంస్కృతికాభివృద్ధిని త్వరితం చెయ్యమనీ ప్రభుత్వంపై ఒత్తిడి తేవచ్చును. తద్వారా వేలాది వ్యక్తులలో ప్రతి ఒక్కరికి పూర్తిగా తగిన, సౌకర్యవంతమైన జీవన స్థితి లభిస్తుంది.

మేధావికి "ప్రజల మధ్య పని చెయ్యడం" కన్న గత్యంతరం లేదనే వాస్తవం, "నాయకుడు" అవసరం కొద్దీ "సమూహాన్ని కలవవలసి వచ్చిందనే వాస్తవం రష్యన్ సాహిత్యంలో స్పష్టంగా ప్రతి ఫలించలేదు.

మేధావి మనస్తత్వంలో చీలిక అతని యవ్వన ప్రారంభంలోనే జరిగింది. సోషలిజం మార్గదర్శక సిద్ధాంతమని అతను అంగీకరించక తప్పనప్పుడే ఆ పరిణామం జరిగింది.

వ్యక్తి అనుభవాల మొత్తం కన్న చాల తక్కువ భాగాన్ని మాత్రమే మనసు మరిచిపోగలదు. పూర్వీకుల నుంచి వారసత్వంగా అందిన శక్తివంతమైన సాంఘిక సారాన్ని తమ వయ్యక్తిక జీవిత అభిప్రాయాలతో విజయవంతంగా వ్యతిరేకించే శక్తి అతి కొద్ది మందికే ఉంటుంది. అవసరమైనదేమిటనే గుర్తింపుతో వ్యక్తిగత ఇచ్ఛ, సజీవత్వంలో విశ్వాసం, తనవ్యక్తిత్వపు సమగ్రత సమన్వయ పూరితంగా కలవగలిగిన మనసే సృజనాత్మకంగా స్థిరంగాను, ఫలవంతంగాను ఉంటుంది. దేశపు మొత్తం సాంఘిక, ఆర్థిక పరిస్థితులే మనసుకు వ్యక్తిగత రంగు దిద్దుతాయనే వాస్తవంతో పాటుగానే, ప్రత్యేకమైన రష న్ కారణాలు రష్యన్ మేధావిలో వ్యక్తిగత ధోరణి ప్రబలడానికి చాలవరకు తోడ్పడ్డాయి. అతనితో దేశంలో కెల్లా సాంస్కృతికంగా అతనే మౌలికమనే భావనను కల్పించాయి. అతను చుట్టూ చూస్తే ఆత్మరక్షణ వ్యవహారంలో మునిగిపోయిన ప్రభుత్వం, ఆర్థికంగాను, మానసికంగాను దిగజారిపోతున్న భూస్వామ్య ప్రభువర్గం, తన శక్తులను కూడగట్టుకునేందుకు తొందరపడని పారిశ్రామిక వర్గం, అవినీతీ, అజ్ఞానమూ నిండిన అధికార వర్గం, ఏ ప్రభావమూ వెయ్యలేని మత వ్యవస్థ రాజ్యాంగ యంత్రం పాదం కింద అజ్ఞానంలో మగ్గిపోతూ ఉండడం కనబడింది.

తన చుట్టూ కనబడుతున్న వాళ్ళకంటే తాను తాజా, నవోన్మేషంగా, శక్తివంతంగా ఉన్నానని మేధావి భావించడం సహజమే. అందువల్ల అతను స్వీయ ఆరాధనలో పడిపోయి తన శక్తి సామర్థ్యాలను ఎక్కువగా అంచనా వేసుకోవడం కూడ జరిగింది....

గత శతాబ్దంలోని చెబ్బైల దశకం ఒక వాస్తవానికి తిరుగులేని నిదర్శనంగా నిలుస్తుంది. అదేమంటే, మానవ అస్తిత్వం అనే ఒక యాదృచ్ఛిక వాస్తవాన్ని చారిత్రక అవసరం స్థాయికి అభివృద్ధి చేయగల శక్తి కేవలం ఒక సామాజిక భావానికి మాత్రమే ఉంది. వ్యక్తిగత అస్థిత్వంలోకి కవిత్వాన్ని నింపగలిగినది సామాజిక భావం మాత్రమే. వ్యక్తిని సామూహిక శక్తితో

నింపడం ద్వారా అని వ్యక్తిగత అస్తిత్వాన్ని గాఢమైన, సృజనాత్మకమైన స్పృహతో నింపుతుంది.

ఈ నాయకుడు పతనమయ్యాడనీ, చనిపోయాడనీ మీరు అనవచ్చు. అది నిజమే అయితే అందువల్ల పోరాట సౌందర్యాన్నీ, అవసరాన్నీ అది రద్దుచేయ గలుగుతుందా? సామూహిక సూత్రపు అనివార్య విజయంలో విశ్వాసాన్ని అది పోగొట్టగలుగుతుంది.

ఈ నాయకుడు ఓడిపోయాడు. అతను చేయగలిగిందంతా చేశాడు. అంత కన్న ఎక్కువ మరెవరూ చేయలేరు.

నిన్నటికి చెందిన ఈ మనిషి రైతును ఎదుర్కొన్నాడు. ఆ రైతుకు తనదైన చరిత్ర ఉంది. ఒక దుష్టాత్మ ఎడతెగకుండా సాగించిన కుతంత్రాలకు వ్యతిరేకంగా సుదీర్ఘ కాలం, వీరోచితంగా పోరాడుతూ వచ్చిన చరిత్ర అది. ఆ దుష్టాత్మ అడవి రూపంలోనో, ఊబి రూపంలోనో, తాతార్‌ల రూపంలోనో, ప్రభువుల రూపంలోనో, అధికారుల రూపంలోనో, మొత్తం మీద పాలకుల రూపంలోనో వ్యక్తమై ఉండవచ్చును. ఈ భూతం నుంచి రక్షణ పొందేందుకు రైతు మతం వెనుక దాక్కొని సుదీర్ఘ కాలపు బాధితునిలా రహస్య జీవితం గడిపాడు. అందరినీ విని ఎవరినీ నమ్మనివాడిలా తయారయ్యాడు.

ఈ నిగూఢ వ్యక్తిని పూర్తి రూపంలో చిత్రించడానికే మన సాహిత్యంలోని సృజనాత్మక శక్తిలో అత్యధిక భాగం ఖర్చయింది. రైతు మనసును స్పష్టం చేయడానికి, ఇంకా ఎక్కువ వెలుగు ప్రసరించడానికి విశ్లేషణా సముద్రమే ఖర్చయింది. రైతును ప్రభువర్గీయులు దైవభీతి గల క్రైస్తవునిగాను, లొంగుబాటుతనం, క్షమాహృదయం గల వాడిగాను చిత్రించారు. రైతుకు వ్యతిరేకంగా ఘోరమైన తప్పిదాలు చేసిన తమను రైతు క్షమించాలని కోరుకుంటారు గనుక వాళ్ళలా చిత్రించడం సహజమే.

పాత నరోద్నిక్కులు తమసాహిత్యంలో ఆడంబరమైన రైతును తయారు చేశారు. అతను మనసులో సామూహికవాదే. అత్యున్నత న్యాయాకాంక్షతో నిండిన వాడు. ''మంచిదీ, ఉన్నతమైనదీ, శాశ్వతమైనదీ విత్తడానికి'' వచ్చే వాళ్ళెవరినయినా హృదయ పూర్వకంగా ఆహ్వానిస్తాడు.

తొంబైలలో మాత్రమే, సున్నితమూ, కచ్చితమూ అయిన మహా కళాకారుడి హస్తంతో విజి కొరెలెంకో న్యాయమైన, వాస్తవమైన రైతు రూపాన్ని పూర్తి స్వరూపంతో చిత్రించాడు. (ది రివర్ ప్లేస్ అనే కథలో త్యులిన్ అనే పాత్ర-అను).

సోషలిజం బోధకుడు త్యులిన్‌ను కలిశాడు. కాని త్యులిన్ తన స్థితి నుంచి పైకి ఎదగక పోయాడు. మేధావిని అర్థం చేసుకోలేక పోయాడు. నమ్మ లేకపోయాడు. ఈ విషాదం వల్లనే మన నాయకుడు 'గుండె బద్దలయిం దనేది తెలిసిన విషయమే.

ఈ ఓటమి తర్వాత, పుష్కిన్ స్మారక చిహ్నాన్ని ఆవిష్కరిస్తూ దాస్తవిస్కీ చేసిన ప్రసంగం వచ్చింది. ఆ ప్రసంగం పరాజితుల గాయాల మీదనే వాతలు పెట్టింది. ఆ తర్వాత నిరాశాభరితమైన టాల్‌స్టాయ్ గొంతు వినబడింది. వందలాది మంది యువకులు, అద్భుతమైన మనుషులు పడి పోయిన తర్వాత, ఒక దశాబ్దపు వీరోచిత పోరాటం తర్వాత, ఈ బానిసల భూమిలోని గొప్ప మేధావులు ముక్తకంఠంతో ప్రకటించారు;

''లొంగిపో''

''చెడును ప్రతిఘటించేందుకు హింసను వాడకు''

రష్యన్ చరిత్రలో ఇంతకన్న ప్రమాదకరమైన క్షణం మరొకటి తెలియదు. అంతేకాదు, అప్పటికే చెడును ప్రతిఘటించడంలో, తమ లక్ష్యాల కోసం పోరాడడంలో తమకున్న శక్తిని ప్రదర్శించి ఉన్న ప్రజలకు ఇంతకన్న అవమానకరమైన నినాదం కూడ మరొకటి ఉండదు.

ఎనభైలలో మేధావి స్వీయ నిర్ణయం కోసం మూడు మార్గాలలో ప్రయ త్నించాడు. ఆ మార్గాలు ప్రజలు, సాంస్కృతిక కార్యక్రమాలు, వ్యక్తిగత నైపుణ్యం- ఈ మూడు మార్గాలూ కలిసి ఒక రకమైన వృత్తం తయార యింది. ప్రజలంటే ఒక శక్తి అనీ, మేధావి వర్గం గనుక వారికి నిర్మాణా లనూ, నిర్దిష్ట మార్గదర్శకత్వాన్నీ సమకూర్చకలిగితే జీవితపు సంకుచిత పరి పరిమితులను విస్తరించగలరని, విస్తరిస్తారని, తమమధ్య మేధావులకు స్థానం కల్పించగలరని అనిపించేది. సాంస్కృతిక కార్యక్రమాలంటే ప్రజలకు తమ హక్కుల గురించీ, బాధ్యతల గురించీ స్పృహ పెంచడమనీ సంఘటిత పర్చడ మనీ అనిపించేది. స్వీయ నైపుణ్యం అంటే, ప్రజా అభివృద్ధి దిశలో "స్వల్ప విషయాల''ను మరింత ఫలవంతం చేసేందుకు అవసరమైన వ్యక్తిగల అనుభ వాలను సంఘటిత పరచడం.

ఐతే, ఈ చట్టం లోపలనే మానసిక అసమ్మతి చెలరేగింది. సంకుచిత క్షతగాత్ర సోషలిస్టు ముసుగుల వెనుక దురాశాపరులైన, ఒంటరి క్షుద్రుల నిరుత్సాహపు ముఖాలు కనబడ్డాయి. వాళ్ళు పైన చెప్పిన మూడు మార్గాలలో ఏదో ఒకదానికి తమను తాము పరిమితం చేసుకున్నారు. సంఘటనల క్రమం వల్ల అతలా కుతలమై పోయిన తమ మనసుల్లో ప్రశాంతత నింపుకునేందుకు తీవ్రంగా ప్రయత్నించడం ప్రారంభించారు. తాము గడిపి వచ్చిన జీవితాన్ని గురించిన నిశిత విశ్లేషణలు ప్రారంభమయాయి....

రష్యన్ మేధావి ఇక మితవాద పక్షం వేపు ప్రయాణాన్ని త్వరితం చేశాడు. సోషలిజం బంధాలను గబగబా తెంచుమన్నాడు. మనకాలం లోనూ

అదేవిధంగా జరుగుతోంది. అతని లక్ష్యం ఏమిటి ? దేశ జీవితంలో 90వ దశకం మధ్య భాగంలో ఒక కొత్త విప్లవకర వర్గం తలెత్తడం ప్రారంభమైనప్పుడు మళ్ళీ అతను తన మనసును సోషలిజానికి ముడివేశాడు. పది సంవత్సరాల తర్వాత మళ్ళీ అంతే వేగంగా ఈ బంధాలను తెంచుకున్నాడు—

అతను మితవాదంవైపు మొగ్గాడు? విస్తృతంగా సాగిన ఈ పరిణామానికి మరికొన్ని ఆసక్తికరమైన సంఘటనలతో సంబంధం ఉంది. ఆ సంఘటనలన్నీ వస్తుగతంగానే మేధావి మానసిక స్థితి అప్పుడెలా ఉండేదో ఇప్పుడెలా ఉందో వివరిస్తాయి. అప్పటికీ ఇప్పటికీ ఒకే ఒక్క తేడా ఏమంటే, 80వ దశకపు మనిషి మన సమకాలీనుడి కన్న ఎక్కువ వినయంగానూ, తక్కువ మొరటుగానూ, కజ్జాకోరుగానూ ఉండేవాడు.

ఈ సంఘటనలకు కొన్ని ఉదాహరణలు చూద్దాం: 80 లలో గౌరవనీయుడైన పి. డి. బొబొరికిన్ 'అతని వివేకం' అనే కథ రాశాడు. దానిలో నాయకపాత్ర అంతకు ముందు వరకు పవిత్రంగా భావించిన ఆదర్శాలకు ద్రోహం చేసినందుకు రచయిత ఆ పాత్రను తప్పుపట్టాడు. 1907 లో జి. యెమెల్యాన్‌చెంకో 'అతని మితవాద ప్రయాణం' అనే కథ రాశాడు. ఆ కథలో రచయిత నాయక పాత్రచేసిన పనిని సమర్ధిస్తాడు. నాయకుడు అంతవరకూ సోషలిస్టుగా ఒక పార్టీ కమిటీ సభ్యుడుగాఉండి, ఒక మంత్రిత్వ శాఖలో అధికారి అయేందుకు ఆదర్శాలు వదులు కుంటాడు—

80 లలో కూడ బూతు సాహిత్యం ఉండేది గాని అప్పుడు అది రాసే వాళ్ళు ఇద్దరిని మించి ఉండేవాళ్ళు కారు. ఇప్పుడు రాస్తున్న వాళ్ళంత అసహ్యకరంగాను, చదవడానికి వీల్లేకుండాను రా సేవాళ్ళు.

అప్పుడూ ఈ విద్రోహుల కేంద్రస్థానంగా నొవొయె రెమ్యా వంటి పత్రిక ఒకటే ఉండేది. ఇప్పుడు అటువంటి స్థానాలు చాలా అయ్యాయి. ఇదంతా మేధావి వర్గం సంఖ్యరీత్యా పెరిగినందుకు సూచనా ? లేక విలాస జీవితపు ఆకర్షణల పట్ల వాళ్ళలో ప్రతిఘటనా శక్తి క్షీణించిందనేందుకు సూచనా ?

మెన్షికోవ్ పత్రిక 'డెల్సా' ఒక సైద్ధాంతిక పునర్జన్మనెత్తి 'రుస్కాయా మిస్ల్' గా మారింది. "స్వల్ప విషయాల" ప్రబోధం వందలాది సార్లు పడేపడే సాగుతుంది. "మనకాలం విశాల కర్తవ్యాల కాలం కాదు" అనే ఎన్ బైల నాటి నినాదం వేలాదిసార్లు ఉచ్చరించబడుతోంది.

ఇంత సన్నిహిత సంబంధం కలిగిన ఉదాహరణలను బట్టి ఒక విషయం రుజువవుతోంది: ప్రజలతో ప్రతి ఒక సంబంధం ఏర్పడిన వెంటనే "తన వలయాలలోకి తాను తిరిగి వెళ్ళేందుకు" మేధావి తపన పడుతున్నాడు. అతను సామాజిక సమస్యలను పరిష్కరించేందు కంటే వ్యక్తిగత సమస్యలను పరిష్కరించేందుకు ప్రయత్నిస్తున్నాడు.

ఎనభైలలో తాము చదివిన దానిలోంచి త్వరితంగా భావాలు గ్రహించే అలవాటుగా ఉండేది. జనం మిఖయిలోవ్‌స్కీనీ, ప్లెఖనోవ్‌నూ, టాల్‌స్టాయినీ డాస్టవిస్కీనీ, డూరింగ్‌నూ, షోపెన్‌హర్‌నూ చదువుతుండే వాళ్ళు, అన్ని రకాల బోధనలకు శిష్యులు తయారయ్యే వారు. తద్వారా ఆశ్చర్యకరమైనంత త్వరగా జనం యుద్ధానికి సిద్ధమైన బృందాలుగా చీలిపోయేవారు. విభిన్న విశ్వాసాలు ఎంత త్వరగా అనుసరింపబడేవో ఆ తొందరపాటు తనాన్ని నేను నొక్కి చెప్పదలచుకున్నాను. బలహీనుడూ, ఒంటరీ అయిన మనిషి పోరాటంలో తన ఉనికి కోసం ఏ ఆయుధం కనబడితే ఆ ఆయుధాన్ని అందుకుంటాడు. అది తన శక్తికి సరిపోతుందా లేదా చూడడు. 80 లలో విశ్వాసాలను కలిగి ఉండడం కూడ ఇట్లాగే జరిగింది. 80 ల లోను మనకాలం లోను భావాలు వదులు కోవడం విస్తృతం జరగడానికి కారణం ఈ తొందరపాటు స్వీకరణే ఒక విషయం గుర్తించుకోవాలి. ఇటువంటి మనుషులు జ్ఞాన శక్తిలో ఆనందం పొందడం కోసం అధ్యయనం వైపు రారు. జ్ఞాన శక్తిలో ఆనందం పొందగలిగినప్పుడే, ఆ ఉద్వేగం మనుషులకు జ్ఞాన సీమలను ఇతోధికంగా, అనంతంగా విస్తరించుకునే స్వేచ్ఛ కోసం పోరాడే ప్రేరణనిస్తుంది. కాని పైన చెప్పినలాంటి వాళ్ళు తమ సంకుచిత స్వార్థ ప్రయోజనాల కోసం. ''వ్యక్తిత్వ స్థాపన'' కోసం మాత్రమే. అధ్యయనం చేస్తారు.—

80 లలో కూడ ఇవాల్టి లాగానే నిరాశావాదం విస్తృతంగా ఉండేది. విశ్వానికి అర్థం ఏమిటని యువకులు ఇప్పటి లాగనే అనుమానాలు వ్యక్తం చేసేవాళ్ళు ఆత్మహత్యలకు నిస్పృహే సాధారణ కారణంగా ఉండేది. దైవం గురించీ, మతం గురించీ ఎన్నో వ్యాఖ్యానాలు వెలువడేవి కాని ఒక నిష్ఫల స్పృహ మరో మార్గానికి, సామాన్య జీవనానికి తిరుగు ప్రయాణం'' అనే ముసుగు వెనుకనో, ''ప్రకృతిలోకి వెళ్ళాం'' అనే ఉద్యమంగా మొదలై 'మేధావుల కాలనీల' నిర్మాణం ముసుగులోనూ ఈ నిష్ఫలత్వాన్ని దాచుకోవడానికి ప్రయత్నాలు జరిగేవి.

మన వాళ్ళకు సహజమైన శక్తిలేని, నిహిలిస్టు వ్యక్తివాదన్ని ఈ కాలనీలలో జీవితం చాల స్పష్టంగా చూపింది. మేధావికి స్వతస్సిద్ధంగా ఉండే క్రమశిక్షణా రాహిత్యం. సామాజిక నియమాల రాహిత్యం వివరంగానూ, త్వరగానూ కనబడ్డాయి. ఒక్కుమ్మడిగా, ఏదో ఒక దుర్మార్గ భూతం లాగ, రష్యన్ మేధావిలోని దారుణమైన అసహ్యకరమైన లక్షణం బయట పడింది ఆ లక్షణమేమంటే, తన తోటి మనుషుల మానవీయహోదా పట్ల అతనికి ఉండిన భయంకరమైన చిన్నచూపు. ఈ కాలనీల నాటకం అవి ఏర్పడిన నాటి నుంచే ప్రారంభమైంది. అటువంటి మనుషుల బృందం ఒకటి, ప్రకృతిలోకి తిరిగి వెళ్ళాలనేతపనతో, నూతనజీవితం ప్రారంభించిందో లేదో,

వారిలో ప్రతి ఒక్కరూ, తవ అహాన్ని, తన 'నేను' తనాన్ని' నిలబెట్టుకోవాలనే అనారోగ్యకరమైన, మానసిక వ్యాధిపీడితమైన ఆకాంక్షను ఉధృతం చేశారు. అందరికందరూ తమకు సజీవంగా చర్మం ఒలిచినట్టు ప్రవర్తించారు. నరాలను సాగలాగినట్టు, శిథిలమయి పోయినట్టు, పొరుగు మనిషితో సంబంధమే సహించరాని ఆందోళన అయినట్టు ప్రవర్తించారు. 'స్వీయ పరిపూర్ణత్వం'' అనేది ఒక రకమైన నైతిక నరమాంస భక్షణగా మారిపోయింది. ఒక కచ్చితమైన నైతిక సూత్రావళిని స్థాపించడానికి సిద్ధపడుతూనే నిజానికి వీళ్ళు ఒకరినొకరు ముక్కలు చేయబూనారు. తన అహం గురించి ... జ్ఞానంతో ప్రతి ఒక్కరూ పొరుగువాడిలోనూ అటువంటి భావమే ... మానసిక వ్యాధి పీడితులలా కోపావేశాలకు లోనయ్యారు. తోటి మనుషుల పట్ల ప్రతి మనిషికీ కఠినమైన- అసూయాకరమైన దృష్టి ఉండే సంబంధాలు నెలకొన్నాయి. ఈ సంబంధాలు దారుణమైన అనుమానాలతో నిండినవి క్రైస్తవ కాపట్యంతో నిండినవి. కొన్ని నెలల లోపలే, ఆరోగ్యవంతులు నరాల బలహీనతకు లోనయి మానసిక రోగులయ్యారు. స్ఫూర్తి తరిగిపోయి, మాజీ సహచరుల పట్ల వ్యక్తావ్యక్త ద్వేషంతో విడిపోయారు. (అయిపోయింది)

## హరీంద్రుడి అస్తమయం

తెలుగు నేలపై పుట్టి పెరిగి తెలుగువాళ్ళను, వారి పోరాటాలను ప్రేమించి కవిత్వీకరించిన బహుముఖ ప్రతిభాశాలి హరీంద్రనాథ్ ఛటోపాధ్యాయ తన 93 ఏళ్ళ వయస్సులో జూన్ 23న అస్తమించాడు. తండ్రి అఘోరనాథ్ ఛటోపాధ్యాయ నుంచి జాతీయోద్యమప్రభావితుడు... సోదరుడు వీరేంద్రనాథ్ పాల్గొన్న గదర్ పార్టీ కార్యక్రమాలనుంచి ... డయినా, ప్రధానంగా హరీంద్రనాథ్ చటోపాధ్యాయ మట్టినీ, మను... ప్రేమించిన వ్యక్తి, విశ్వనాథ, కృష్ణశాస్త్రి, అబ్బూరి మొదలైన భావకవులతో పరిచయుండినా చలంసన్నిహితుడయినా, షురూహువా హైజంగ్ హమారా (పోరు మొదలైంది) అంటూ గర్జించి శ్రీశ్రీని, అభ్యుదయ కవులను ప్రభావితం చేశాడు. ఖుదీరాంబోస్‌ను ఉరితీసినా, తెలంగాణా పోరాటకాలంలో కాటూరు ఎలమర్రులలో పోలీసులు అమానుషకృత్యాలు జరిపినాహరీంద్రనాథ్ సహించలేక పోయాడు. ప్రజలపై, ప్రజా ఉద్యమాలపై అణచివేత జరిగినప్పుడు ఆయన హృదయాగ్నులు అక్షరాలై ప్రజ్వరిల్లాయి.

కవి, గాయకుడు, నటుడు, చిత్రకారుడు, స్వాతంత్ర్యయోధుడు, సంఘసేవకుడు పత్రికారచయిత అయిన హరీంద్రనాథ్ ఛటోపాధ్యాయ ప్రజాఉద్యమాలకు ప్రజాకళలకు చేసిన సేవను గుర్తించి 'సృజన' ఆయనకు జోహార్లు అర్పిస్తున్నది.

—సాహితీమిత్రులు

శాంతిభద్రతలను రక్షించడానికి!
అదీగమనించ దగ్గ విషయం.
దేశద్రోహాన్ని శిక్షించడానికి;
అదీ గుర్తించదగ్గ విశేషం.
కాని ఒక్క సంగతుంది జ్ఞాపకం తెస్తున్నా
చాలాసార్లు రాసిందే మళ్ళామళ్ళా రాస్తున్నా
అదిమిపట్టి బెదరగొట్టి అందర్నీ పాలించలేరు!
[illegible] అంద[illegible] కాలుతొక్కి జనాన్ని శాసించలేరు!
[illegible] [illegible] వాళ్ళంతా, గద్దెమీద వాళ్ళంతా
శ్రద్ధబూని వినడానికి చేస్తున్న హెచ్చరిక!

హింసవల్ల పీడవల్ల హీనహేయ మాయవల్ల
తైదు వల్ల కత్తివల్ల, హత్యాసత్యాలవల్ల
గ్రామాలకి గ్రామాలని గాయం చేయడం వల్ల
గ్రామీణుల మానాలను ఘాతం చేయడంవల్ల
నిరంకుశల పాలన నేలరాలడం తథ్యం
నరాంతకుల దురాగతం పరాస్తమవడం సత్యం!
తిరుగులేని ఈ సత్యం చరిత్ర చెప్పే పాఠం!
మరీమరీ మీరంతా మననం చెయ్యండంటా!

అంచీ, [illegible] ప్రజల గుండెలాగవులే ముమ్మాటికి
[illegible] తిరుగుబాటు తిరిగిలేచు నొకనాటికి
చెలరేగిన ప్రజలయెదల జ్వలదుగ్ర మహాగ్రహార్చి
చండశాసనుల గాల్చును శలభములనుగా నొనర్చి
జ్ఞాపకముందా నేస్తం? చరిత్ర చెప్పే సత్యం?

1948లో 'స్వతంత్ర భారత' పోలీసులు కృష్ణాజిల్లా కాటూరు, ఎలమర్రు గ్రామాలలోజరిపిన అమానుషకృత్యాలపై హరీన్ కవితాగ్రహం ఇది.

అనువాదం : శ్రీశ్రీ

# ఎలమర్రా - కాటూరా

—హరీంద్రనాథ్ చటోపాధ్యాయ

ఎలమర్రూ! ఎలమర్రూ! ఓ తెలుగు గ్రామం!
ఇదేమిటి నీ పేరు గుండెల్లో బాణం,
మా కళ్ళల్లో కారం! పేగుల్లో గాలం!
ఇదేమిటి ఎలమర్రూ నీపేరా ద్రోహం?
ప్రమాదం, అపాయం, పేరులేని ఘోరం?

ఎలమర్రూ! ఎలమర్రూ! ఈనాటికి దేశం
ఈ భారతదేశం, ఏ దురావేశం
ఏ దురాచారం, మరే క్రూరపాశం
ఏ శాపం పీడిసే తాల్చిందీరూపం!

ఎలమర్రూ? ఇన్నాళ్ళకి ఏమైనావ్ పాపం!
పిన్నామమ్మా! ఓ నాటిచిన్నారి గ్రామం!
నీకు జరిగిన నిష్కారణ దారుణావమానం,
మూడువందల జనాన్ని, ఏ నేరం ఎరుగని ప్రజల్ని
పసివాళ్ళని, కుర్రాళ్ళని, ముసలాళ్ళని పట్టి
అయ్యయ్యో, ఆరుబయట ఊరుమధ్య నిలిపి
ఒంటిబట్టలూడదీసి ఊరేగింపు సొంపు
ఎవరిమోదం కోసం? ఎవరి వినోదంకోసం?
ఏమిటీ కక్ష? ఎందుకింత శిక్ష?

ఎవరా? మరెవరు మన మ.రా.శ్రీ ప్రభుత్వం
ప్రభుత్వం తాలూకు పోలీసుల మహత్త్వం
ఎలమర్రూ ప్రజలమీద ఎంత పరాక్రమం!
మూడువందల పిచ్చుకలమీద ఒకేఒక్క వజ్రాయుధం
పైశాచిక తాండవం! నైశాచర నాటకం!

(తరువాయి 3వ కవరు పేజీ)